శ్రీమదుమారమణపరబ్రహ్మణే నమః.

# హరిహరతారతమ్యశతశ్లోకి.

(శివప్రాశస్త్యప్రతిపాదకము.)

ఇది

శ్రీపరమేశ్వరాధ్వర్యూపనామక, సుధీమణిబిరుదాంకిత, కాంచీపురనివాసి

అగు

హరదత్తాచార్యప్రణీతము.

విశాఖపట్టణవాస్తవ్యుఁడగు

పూండి పెద్ది - లింగమూర్తిపంతులచే రచియింపబడిన

ఆంధ్రపద్యలఘుతాత్పర్యసహితము.

శ్రీవెంకటగిరి సంస్థానాధీశ్వరులగు

శ్రీమహారాజా శ్రీవెలుగోటి శ్రీరాజగోపాల

కృష్ణయాచేంద్రబహద్దర్, పంచహజార్

మన్సబుదార్, K.C.I.E. వారి

ద్రవ్యసహాయమువలన

తిరుపతి పుండరీకనిలయముద్రాక్షరశాలయందు

పూండి పెద్ది లింగమూర్తిపంతులుచే

ముద్రింపించి ప్రకటింపఁబడినది.

1913-వ సం॥ జూలై నెల 10 తేది.



వెల రూ. 0—6—0

శ్రీమదుమాసహిత పరబ్రహ్మణే నమః

# హరిహర తారతమ్య శతశ్లోకీ.

(శివప్రాశస్త్య ప్రతిపాదకము)

గ్రంథోత్పత్త్యాంధ్రీకరణ ముద్రితక్రమాది నిరూపక

## ఉపోద్ఘాతము.

ఈగ్రంథము సంస్కృత శ్లోకరూపమునమాత్రము తొల్లి శ్రీపరమేశ్వరారాధ్యయ్యాపనామక, సుధీమణిబిరుదాంకిత, హరదత్తాచార్య ప్రణీతము. దీనికి కర్ణాకర్ణికగా హరదత్తాచార్య శ్లోకములనివాముక లోకములోఁగలదు. అన్నిశ్లోకములు కాకున్నను, చాలామంది వైష్ణవులకును, శైవులకును, కొన్నికొన్నిశ్లోకములు ముఖస్థముగా వచ్చుటయును, వారు అక్కడక్కడ చదువుచుండుటయును నేనువినుచుంటిని. ఈహరిదత్తాచార్య లేకాలపువాడో, యితనియన్వయ గోత్రనామము లెవ్వియో, తలిదండ్రులెవ్వరో నిశ్చయించుటకు తగినన్ని నిదర్శనములు నాకుదొరకలేదు. అందులకయి ప్రయత్నించుటవలన గ్రంథ ముద్రణం బాలస్యమయి లోకమున కీయపూర్వగ్రంథము వెల్లడియగుటకు విళంబమగునను తలంపుతో ముందుగా గ్రంథముమాత్రము ప్రకటించితిని. సాధ్యమయినంత ప్రయత్నముచేసి యీ ఆచార్యుల కాలనిర్ణయమును తదితరవిషయములను తాత్పర్యములో సహేతుక శాస్త్రనిదర్శనములును ఇంకొకసారి విస్తరించి వ్రాయఁదలచితినిగాని యీ హరదత్తాచార్యులు సుమారు వేయిసంవత్సరముల క్రిందటివాడనియు, ఈశ్లోకములు కంచిలోనాయనచేతనే అగ్నికుండములోనిలువఁబడి చెప్పబడినవ

నియు, బహుజనశ్రుతముగా నీక్రింది కధ చెప్పబడుచున్నది. దాని నిజానిజము లెట్లున్నను కధమాత్రము విననింపుగానుండును గనుక వివరించెద.

శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా॥
పురీ ద్వారావతీ చైవ సప్తైతా మోక్షదాయికాః॥

అను మోక్షదాయకములగు పురములేడింటిలో నొకటియై శ్రీయేకామ్రేశ్వర వరదరాజస్వాములను ప్రత్యేకస్వనామములుగల శివకేశవుల దేవాలయములతో నొప్పుచు, నేటికిని బహుజనులచే దర్శింపబడుచుండు కాంచీపురము (కంజీవరము లేక కంచి) శివకంచి, విష్ణుకంచి, యని రెండుభాగములుగానుండెనట. ఇప్పటికినట్లేయున్నది. శివకంచిలో శివాలయములో జరుగు ఉత్సవములలో, విష్ణుకంచిలో వైష్ణవుల వీధి వెంబడిని, విష్ణుకంచిలో విష్ణ్వాలయములో జరుగు ఉత్సవములలో, శివకంచిలో శైవులవీధి వెంబడిని, స్వామినితిరువీధించు నాచారము పూర్వముకలదట. ఈ యాచారమిప్పుడునుకలదని వినబడును. స్మార్తులు శివకేశవ తారతమ్యము పరిగణింపనివారు గనుక ఉభయదేవులకు నొక్కరీతిగానే హారతిమొదలగు నుపచారములుసలిపి సేవించుచుండువారు. వైష్ణవులుమాత్రము శివునియుత్సవము తమవీధినివచ్చినపుడు తలుపులుమూసుకొనువారట, ఇట్లుండగా, నొకానొకనాటిరాత్రి శివునియుత్సవము, నందివాహనముపైని తగినయాభరణపుష్పమాలికాదులతో నలంకరింపబడిన స్వామివిగ్రహముతో, వైష్ణవులవీధి వెంబడిని పోవునప్పుడు, వారు యథాప్రకారముగా తలుపులుమూసుకొనియుండగా, నొకానొకయింటిలో నుత్తమవంశస్త్రురాలును, తల్లిదండ్రుల కొక్కతెయు, బాలవితంతువును సుశీలయునగు నిరువది వత్సరములు వయసుగల యొకచిన్నది మిక్కిలియాసక్తితో, తదేకదీక్షగా తలుపుకన్నములోనుంచి స్వామినిదర్శించి, యదేతలంపుతో నిద్రపోవుతఱి, స్వప్న

మున సత్త్వస్వభావముగల యొక బ్రాహ్మణుడు తనతో సంభోగించినట్లు కలగని తెల్లవారినవెనుక మేలుకొని, తల్లిదండ్రులకుఁ దనస్వప్నవృత్తాంతముఁజెప్పగా, వారు వినియు వినక, కతకాలపు కలలనియు, తమకుమార్తె వయోధర్మముచే మన్మథావస్థయందుండుటచేతఁ దత్సంబంధముగ కలవచ్చెననియూరకుండిరి. పిమ్మట కాలక్రమమున నాచిన్నదానికిగర్భలక్షణములేర్పడుచు గర్భమువిస్తరిల్లుట తల్లిదండ్రులుగని యిదియేమని కూతురునడుగగా తానేదోషము నెఱుగననియు నాడుగన్నకలయే నేటి గర్భమునకు మూలమనియు సప్రమాణముగాఁజెప్పి యేడ్చు కూతురునూరార్చి, యిదియొక దైవశోధయని వారుదలచి, తాము, సంపన్నస్థితియందున్నవారుగావున, కూతుఁదమయింటనే బహిష్కృతరీతిని వేఱుగదిలో కాపురముంచి అన్నపానాదులు శూద్రస్త్రీకివలె నేయిచ్చుచుండిరి ఇంతట నానాటికి గర్భముముదిరి మాసపూర్తిని విధివశంబున నొక పుణ్యదినమున నొకపురుషశిశువావితంతుగర్భమున వెలువడి మాతృమాతామహీమాతామహులవలన బహుగారాబముతోఁబెంచఁబడి యుపనయనమునకీడుమించిన పదిరెండువత్సరముల ప్రాయఁపువాడయ్యెనట ఈచిన్నవాడు తనతల్లిచే నిజమతపారంపర్యత్వేనవచ్చుచున్న సుదర్శనాచార్యులని నామకరణముచేయబడగా తానుతనపేరు హరదత్తాచార్యులని చెప్పుకొనుచుండువాడు (హరదత్తమనగాసుదర్శనము విష్ణువు వెయ్యికమలములతో శివార్చనచేయుచు నందులో నొకకమలమంతరించగా తననేత్రమునుసమర్పించి శివునివలన పద్మమునే నేత్రముగా పొంది పద్మాక్షుడనునామముకలవాడును సుదర్శనమను చక్రమునుపొంది చక్రధరుండును అయ్యెనని పురాణప్రసిద్ధము) తల్లి తనముఖమున తిరుమణి తిరుచూర్ణము పెట్టితే తానవిచెఱిపివైచుకొని విభూతిరేఖలనుంచుకొనువాడట ఇవిచూచి యిరుగుపొరుగువైష్ణవాంగనలు ఏడవడో స్మార్తునికి గూఢజుడని యనుకొనువారట. ఇట్లుకొంతకాలము గతించినపిమ్మటఁదన

కుపనయనము లేకపోవుటయు నిరుగుపొరుగువారనుకొనుమాటలు విని యు అప్పటికి పదునాఱేండ్లవయస్సు మించిన యీబాలుడు ఒకానొకదినము నవురపాలకుడగు రాజునొద్దకుఁబోయి "హరిహర తారతమ్యవిషయము లో పెద్దలను నేనుకొన్ని ప్రశ్నలడుగబోవుచున్నాను అందుకయి వీం వై ష్ణవవీరశైవుల నెల్లరను పిలిపించవలెను. సభాస్థలమున నొక పెద్ద పాతరగొ య్యిత్రవ్వించి దానినిండా యెఱ్ఱని చింత నిప్పులు రగులఁబెట్టించి యుంచ వలెను" అనికోరగా రాజట్లు తక్షణమే సర్వమును సిద్ధము సేయఁగా హ రదత్తాచార్యులు తనతల్లిని చేయిపట్టుకొని యగ్నికుండములోనికి దిగి కూర్చుండఁబెట్టి యామెతొడపైని తానుకూర్చుండి పట్టణపు రాజును పుర జనులు సమస్తమయినవారును సర్వమతస్థులును కూడియున్న యాసభ యందు తానును తనతల్లియు నగ్నికుండములోనుండియే "వృద్ధాన్ శృతిస్మృతిపురాణవిశేషభాషా నిశ్శరిః బుద్ధికుశలాన్" అను స్వగ్రంథపు నాంది శ్లోకములో సభావందనము చేసి "ఏకస్సముద్రసలిలే వటపత్రశా యీ" అను మొదటిప్రశ్నయగు శ్లోకము మొదలుకొని శతశ్లోకియను పేర నూటికిపైగా ప్రశ్నలడిగెను. అప్పటికి కూడియున్న సభవారందరు నిరుత్తరులేగాని యొకరును వానికిబదులు చెప్పినవారు లేకపోయిరి. (ఇ ప్పటికిని చాలామందికి శ్లోకములువచ్చును. లోకమందనేక ప్రతులున్నవి ప్రతివారును శ్లోకములు చదివి హరదత్తాచార్యులవారి సామర్థ్యమునకు ను చమత్కృతికిని సంతసించువారేగాని విష్ణుపాశస్త్యమును సూచిం చు నొకశ్లోకమునైనను రచించినవారు లేకపోయిరి) ఇట్లందరు నిరుత్త రులుకాగా తనసామర్థ్యమును తల్లియొక్క నిర్దోషపు లోకాతీత నిర్మల శీలత్వమును లోకమునకు వెల్లడిఁజేసిన హరదత్తాచార్యులవారిని సాక్షా త్తు పరశివుని యవతారముగా సకలజనులు భావించుచుంటయేగాక అతని బోధలయందు మిగుల నాదరముకలవారయి యుండువారట. ఇట్లుకొంత కాలమాయన భూమియందుండి తాననేకులకనేక బోధలుచేయుచు గొ

న్ని గ్రంథములు సైతము రచించి తనపేరు శాశ్వతముగానుండునటుల చేసెను కాని శివకేశవులయందు భేదబుద్ధులు లేక యుభయులను ఉభయమతము లవారు నేకభావముతోఁ గనునటులఁ జేసి తానవతారము చాలించెనట హారదత్తసూత్రములో లేక భాష్యములో నేటికిని వాడుకలో నున్నవనియు దాము వానిని చదువుచుందుమనియు తర్క వ్యాకరణాది పండితులు చెప్పుచుండుట నేనును వినుచున్నవాడను నేను పండితుడను కాకపోవుట చే నవి చదువలేను నిజమయినది కాకపోయినను హారదత్తాచార్యులక థ యీరీతి ననేకులు చెప్పుకొనుట నేను వినియుంటిని గనుక నిచట వ్రాసితిని నిజానిజము లేర్పరుచుకొను భారము చదువరులదేను. హారదత్త శ్లోకములనేకములున్నవనియు అందు కొన్నిమాత్రమే తమకు వచ్చునని యు ననేకులు కొన్ని కొన్ని శ్లోకములిప్పటికిని చదువుచున్నారు. ఎవరి వద్దనూ వినను కొన్ని చిల్లర శ్లోకములే గాని పూర్ణమైన ప్రతి యెక్కడను దొరుకుట యరిదిగానున్నది.

## మదీయ గ్రంథలబ్ధప్రకారము.

పై నిరూపించిన హారదత్తాచార్యులవారిచే రచితములగు శివప్రాశస్త్యప్రతిపాదకశ్లోకములు నూరనికొందరు నూటయిరువది యనికొందఱు ఇట్లనేకులనేకవిధములుగా చెప్పుచుమచ్చుకుమాత్రం "గాఢాంధకారసమనీల" యను 7-వ శ్లోకమును "ఏకైకపరాభువనభీకరకాలకూటం" అను 80-వ శ్లోకమును "మృత్యుంనివార్య" అను 88-వ శ్లోకమును ఇట్లనుమూడైదారు శ్లోకములు మాత్రము చదువుట నేను వినుచుంటిని ఇట్లుండగా క్రీ శ. 1899-వ సంవత్సరములో నేను విశాఖపట్నం జిల్లా యలమంచిలి గ్రామములో నివాసముగానుండు కాలమున అప్పటి కక్కడనున్న లోకల్ మెడికల్ ఆఫీసరు అల్లిక- సీతారామస్వామినాయుడు గారి ప్రోత్సాహముచేత వారింటనే కాలక్షేపార్థము మేము ప్రతిదినము

నను రాత్రి భారతము పురాణముగా జదువుకొనుచుండు వారము. ఆపు రాణసమయమందొకనాడు ప్రసంగవశమున శివకేశవ భారతమ్యావిషయ ము రాగా శివముక్తాభిమానులును దేవశిల్పికులోద్భవులును అక్కడ మునసబు కోర్టువారి ఉగారునగు చేబోలు శ్రీరాములు గారు పైనవివరించిన మూడుశ్లోకములును చదివి “ ఇవి పూర్ణముగానున్న వ్రాతప్రతినాకు దొరికినమొదల నేనచ్చువేయించి లోకమునకు ప్రకటింతు” ననితమ యభిప్రాయమునుకనపర్చిరి. ఆవెంటనే నేను విశాఖపట్నంలో కాపుర మున్న నాయన్నగారగు సోమలింగశాస్త్రిగారి పేర వ్రాసి యాశ్లోకము లను దొరికినన్ని వ్రాసిపంపించుమనికోరగా వారు “ హరిహర భారత మ్యాకతశ్లోకి” యనుపేరుతో విశాఖపట్నంకాపురస్థులగు పరిటి- జగ న్నాథంగారను నొకబ్రాహ్మణునియొద్దనున్న ప్రతికి నకలువ్రాయించి నాకంపిరి. ప్రతిశ్లోకమునకు ప్రతిపదార్థములోనచ్చువేయించి ప్రకటిం పవలెనన్న యూహతో నదరు చేబోలు- శ్రీరాములుగారు కొన్నిశ్లోక ములకుమాత్రము నాచేతనే చెప్పించి టీకవ్రాసి యింతటలౌకికవ్యాపా రాంతరములచే వారును నేనును విడిపోయినందున మఱి వ్రాయలేదు. ఆ ప్రతి వారివద్దనే యుండిపోయినది. ఇట్లు బహుకాలముజరుగగా క్రీ॥శ॥ 1912-వ సంవత్సరముఅక్టోబరు నెలలో నేను కార్యాంతరముచే చిత్తూ రుజిల్లా పుంగనూరు జమీందారువారి వద్దకుబోయి అక్కడ వారిగురు వులును కిరీటస్వాములవారుననుపేరుగల యొకవీరశైవశిఖామణియొద్ద నున్న దలిపిలోనచ్చుకడ్డ ప్రతియొకటిచూచితిని అందులోనున్న దశావ లో వారువ్రాసినపీఠికలో నీశ్లోకములు అప్పయదీక్షితప్రణీతములని వ్రా సిరి. ఇదియెంతమట్టుకునిజమో తెలియదు నాయొద్దనున్న ప్రతిమాత్రము స్పష్టముగా నిందువివరింపబడినప్రకారము హరిదత్తాచార్యప్రణీతముల యినట్టుకనపడుచున్నది. పిమ్మట క్రీ॥ శ॥ 1913-వ సంవత్సరం మార్చి నెలలో నేను నెల్లూరుకు కార్యాంతముచే బోయి అచ్చటనాకు తా

తాత్కాలిక స్నేహితులుగా నేర్పడిన రిటైర్డుసబు అసిస్టెంటుసర్జను అందు మెడి కల్ ప్రాక్టిషనరు (Retired Sub-Assistant Surgeon and Medical Practitioner) ను సత్యవిజయమను పేర హరిశ్చంద్రోపాఖ్యానము శుద్ధాంధ్రకావ్యముగాను మఱియు ననేక గ్రంథములను రచించి కవిలో కములో ఖ్యాతి జెందిన కులాలకులోద్భవులగు అయ్యానకోటపార్థసారథి శెట్టిగారి మేడపైని నేను బసచేసియుండగా నొకదినమున వారివద్ద వారి స్నేహితులగు శ్రీ వ. సుబ్రహ్మణ్యశర్మ గారిచే వారికొసంగబడినదియు కాళహస్తిలో నెవరివద్దనోయున్న ప్రతికినకలు నగు నీశ్లోకములు 80 గల ప్రతియొకటి నేను చూచితిని. సదరు శెట్టిగారును వారిస్నేహితులగు నె ల్లూరు డిస్ట్రిక్టు ఫారస్టు ఆఫీసులో ఎక్కౌంటెంటునగు దుగ్గా సుబ్రహ్మ ణ్యశర్మ గారును వీనికి తెనుగుపద్యములు చేయదలచి పదిపండ్రెండు పద్య ములకుమాత్రము తర్జుమేవ్రాసి యితరవ్యాపకములచే మఱి యీ దృష్టిలేక వ్రాయరైరి. తాత్కాలిక ప్రసంగవశమున నాయొద్దనున్న కాపీ విషయమయి నేను వారితో చెప్పి వెంటనే సదరుప్రతిపంపించమని పైన చెప్పిన చెబోలు-శ్రీరాములు గారి పేర వ్రాయగా, వారుపోస్టుప్యాకెట్టుగా ప్రతినాకుపంపించిరి. నూఱుశ్లోకములుగల ప్రతియొక్క సదరు ప్యాకెట్టు నెల్లూరులో 1913 సం॥ మార్చి 27 తేది ప్రాతఃకాలమున నాకందినది. ఆదినముననే, పార్థసారథి శెట్టిగారి ప్రతిని నాప్రతిని సంప్రతించగా, దీనిలోలేనివి దానిలోను దానిలోలేనివిదీనిలోను చేర్చి మొత్తముమీాఁద 105 శ్లోకములైనవి. నూటికిపైన మెప్పుయున్నను శతకమను పేరులో నే గ్రంథమొప్పుచుండును గనుక శతశ్లోకియని హరదత్తాచార్యుల వారుపెట్టిన పేరునేయుంచితిని గాని పేరుమార్చలేదు. పార్థసారథి శెట్టి గారు నాప్రతిచూచి తెనుగుపద్యములుచేయు భారము నావయినేయుం చినందున ఆరాత్రియేకూర్చుండి నూటఅయిదు శ్లోకములకు పద్యము లువ్రాసి, మఱునాఁడుదయమున వారికగుపరచితిని సాధ్యమగువంతత్వర

లో నేను సుపద్యములతోను, లఘుతాత్పర్యములతోను, వీటిని ప్రచురపర చిన బాగుండునని తలచి, ముద్రించుటకు వలయు ద్రవ్యసహాయమున కెవరిని కోరుదునని యోచించుచుంటినిగాని నెల్లూరున దీని ముద్రించుట కు తగిన సహాయసంపత్తిగాసగువారలు నాకులభించలేదు నేను సామాన్యుల నట్టిసహాయవిషయము యాచింపనూలేను. ఇకనీగ్రంథము ముద్రితమయినరీతియు తన్ముద్రణంబునకు వలయుద్రవ్యసహాయము చేసిన మహానుభావుల యాదర్యాతిశయములను వారిని నేనట్టి సహాయము కోరుటకు గలిగిన యవసరమును. ఈక్రిందవివరించెద. అదిచదివిన వారు గ్రంథపోషకుల యుదారశీలత్వంబున కమితాశ్చర్య ధుర్యులు కాకపోరు. ఇట్టి యాదార్య గాంభీర్యస్వభావులగు మహారాజ లెక్కడెక్కడనో యొక్కరొక్కరుండినగాని యిట్టి యపూర్వ గ్రంథములు లోకములో ప్రకటింపబడుటెట్లు?

గ్రంథముద్రితక్రమము.

ఈగ్రంథముద్ధరించుటకు ద్రవ్యసహాయము చేసినవారు నెల్లూరు మండలాంతర్గత శ్రీ వెంకటగిరి సంస్థానాధీశ్వరులగు శ్రీమహారాజా శ్రీ వెలుగోటి శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్ర బహద్దర్ పంచహజార్ మన్సబుదార్ K. C. I. E. వారు ఈమహాప్రభువువారి యాదర్యాతిశయముల నతిశయోక్తిగాక స్వభావోక్తిగా వర్ణించుటకు వేయి నోళ్లుగల యాశేషుడై నను చాలడన మందప్రజ్ఞుడనగు నేనేమివర్ణించగలను. ఐనను నాయోపికకొలది నాకు తెలిసినంతమట్టుకు యధార్థముగా కించిత్తు వక్కాణించెద ఈవెంకటగిరిసంస్థానము బహుప్రాచీనమైనదియు వీరిపూర్వులు స్వతంత్రరాజులై చిరకాలము ధరనేలినమహారాజులన్నయంశము నేను చెప్పనక్కరలేక చరిత్రలే చెప్పుచున్నవి. అదినుండియు సంస్థానాధీశ్వరుల విద్వద్దాక్షిణ్యములకు మేరలేదు. వీరియందు విద్వద్దా

రణశక్తియేగాక విద్వదాకర్షణశక్తి బహుప్రబలముగానుండెడిదని నాకుఁదోచుచున్నది ఎట్లనగా,

ఉ॥ "ఇమ్మనుజేశ్వరాధముల- కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని- సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక- సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు- భాగవతంబు జగద్ధితంబుగన్॥"

అని శ్రీమద్భాగవతమును రచియించిన సహజపాండిత్యప్రభావుడగు బమ్మెరపోతనామాత్య మహాకవి బహ్వాంతర్ముఖుడును భక్తాగ్రేసరుడును నరస్తుతి పరాఙ్ముఖుడన్నమాట లోకప్రసిద్ధమేగదా. ఆమహాకవివలన స్వైరంబొక గ్రంధము కృతిఁబొందుదమని అప్పటిరాజులనేకులనేక ప్రయత్నములు చేసినను అవియెల్ల వ్యర్థమయ్యెననియు నతడు తపగాటమైన దారిద్ర్యమునైనను బహుసహనభావముతో నోర్చెనుగాని యొకరాజునైనను నుతించి యతనివలన ధనము స్వీకరించినవాడుకాడన్నసంగతి నేను చెప్పనక్కరలేదు. అట్టిమహానుభావుడు తనంతన తానే యనర్థితుడుగా అప్పటి ఈ వెంకటగిరి సంస్థానాధీశ్వరులగు సర్వజ్ఞసింగ భూపాలశిఖామణికిగదా యొక గ్రంధము కృతియొసంగెను హా! యేమి ఈప్రభువుల విద్వదాకర్షణశక్తి! తత్కాలపు ప్రభువులెవరును సర్వప్రయత్నములఁ బొందనేరని బమ్మెరపోతనామాత్య కవికృతిని వీరప్రయత్నముగా బొందగలిగిరి. మఱియు నీసంస్థానప్రభువులు కేవలవిద్వదారణముకలవారేగాక తాముస్వయం విద్వాంసులైనట్టును తోచెడిని "విద్వానేవవిజానాతివిద్వజ్జన పరిశ్రమం" అనుటనిజమేగదా. తాము విద్వాంసులగుటచేనే వీరు విద్వాంసులనాదరించుట. వీరి విద్వత్త్వమునకు, శ్రీనాథునివంటి నిరంకుశప్రతిభావంతుడగు మహాప్రౌఢకవియే పైఁజెప్పిన సర్వజ్ఞసింగభూపాలునిదర్శింపబోవుచు స్వయంపండితులగు

వారిసభయందు తనకేమి పరాభవముగలుగునోయని తన యిష్టదేవత యగు సరస్వతిని.

సీ॥ "దీనారటంకాల-దీర్థమాడించితి దక్షిణాధీశుము-త్యాలశాల
పలుకతోడై తాంధ్రి-భాషామహాకావ్య నైషధగ్రంథసం-దర్భమునను
పగులగొట్టించితు-ద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు-కంచుఢక్క
చంద్రశేఖర క్రియా-శక్తి రాయలయొద్ద బాదుకొల్పితిసార్వ-భౌమబిరుద

గీ॥ మెటుల మెప్పించెదో నన్ను-నిఁకమీఁద
రావుసింగమహీపాలు-ధీవిశాలు
నిందుకొలువున నెలకొని-యుండినీవు
వరసద్గుణ నికురుంబ- శారదాంబ॥"

అని ముందుగాఁ బ్రార్థించుకొని భయపడుచు వెళ్లినట్టుల నాతనిచరిత్ర చదివినవారికందఱికి విశదమేగదా. ఈసర్వజ్ఞభూపాలుడు రచించినగ్రంథములలో ముఖ్యమైనది సింగభూపాలీయమను చమత్కారచంద్రిక (అలంకారశాస్త్రము). అయితే పూర్వులవిషయమయి పైనచెప్పిన యంశములుండగా, ప్రస్తుతపు ప్రభువులగు శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రులవారియందు, తమపూర్వులకుఁగల విద్వదారణ విద్వదాకర్షణ స్వయంవిద్వత్త్వములను గుణములు గలవో లేవో విచారించవలసియున్నది. ఈప్రభువువారిదర్శనము నాకులభించక పూర్వమే వీరియౌదార్యాతిశయములు తమపూర్వుల గుణాతిశయములకు వన్నెదెచ్చునవిగాని యినుమంతయుఁ దీసిపోవునవికావని నేను నిశ్చయించితిని. పులిజాతిలో పులిపిల్లపుట్టునుగాని లేడిపిల్లపుట్టునా? ఆకాశమందలి నక్షత్రములను భూమియందలి యిసుకరేణువులనైన లెక్కింపవచ్చును గాని వీరిసుగుణ సంపత్తిని లెక్కించుటకు శక్యముకాదు. ఇదియతిశయోక్తి కాదు. కేవలమునిజము. ఒక్కనిదర్శనముచూడుము. ప్రశ్నితమున మనదే

శమందున్న జమీందారుల ననేకులను మనమెరిగియున్నారము చూచి యున్నాము, వారివారి యాదాయములును వారివారి వేషభాష లును వారివారి యాదార్యాతిశయములును వారివారి యాధారసం పత్తియు వేలువేలు వ్రాయనక్కరలేదు. సర్వజనవిదితములే అందరునవీ నాచారపరాయణులే గాని పూర్వాచారపారీణులు లేరుగదా ప్రస్తు తపు నాగరికతయొక్క ధర్మమెట్టిదో చూచుడు. చదువు సాములు లేని మూర్ఖుడగు దారిబోవుకూలివాడైనను సోడాబుడ్డి త్రాగువాడేగదా. అ ట్టిస్థితిలో అగర్భశ్రీమంతులు నాంగ్లేయభాషాపారంగదులు నగు నవనా గరికులమాటచెప్పనేల. ప్రస్తుతము పంచాశద్వర్షాతీతవయోవస్థయం దుండి హూణభాషాసమాన పాండిత్యమును గలిగి నవనాగరికులతో స దాయేదోయొకవిధముగా సంగదోషముకూడా కలిగియున్న యీమహ రాజావారికి తమబాల్యాదారభ్య నేటికిని సోడాబుడ్డిఅన్నమాటయే చెవినిబడకూడదట. ఇకవీరిసుగుణసంపత్తి వేలచెప్పవలెనా వీరివిద్వత్వ మును రసగ్రహణ పారీణత్వమునుగూర్చి కొంత చర్చింపవలసియున్నది. అడవియుసిరికాయయు సముద్రవుటుప్పును మనయింటిలో గలుసుకొని యూరగాయయై మనయుదరములోనికిజొచ్చి యానందముకలిగించునటు ల రాజులు మహారాజులునగు జమీందార్లకు పుట్టిల్లగు విశాఖపట్నంజి ల్లా కాపురస్థుడనగు నేను బమ్మెరపోతనామాత్యునివంటి యసాధారణసా మర్థ్యములేనివాడనైనను, అతనివలెనరస్తుతిపరాఙ్ముఖత్వము గొంతవర కుజరిపాలించుకొనుచుండి నా నివాసపుజిల్లాగాక మఱిమూడుజిల్లాల కుపైగానున్న నెల్లూరుజిల్లాలోని యీ వెంకటగిరికివచ్చి యీప్రభుప్ర వారి గుణాతిశయములకుమెచ్చి వీరినిశ్లాఘింపగడఁగుటయే వీరిసుగుణ సంపత్తికి విద్వదాదరణాది గుణగ్రహణపారీణత్వమునకు ప్రబలనిదర్శనము వీరియాదార్యాతిశయములను నేను వేలువేలుగా వ్రాయవలెనన్నచో నేండ్లును పూండ్లును చాలవు. ఈవిషయములో నాకలంకార శాస్త్ర

ములోని యొకయలంకారము స్ఫురణకు వచ్చుచున్నది. అదియేదియన అప్రస్తుతవస్తు ప్రశంసాలంకారము. అనగా ఒకవస్తువుయొక్క గుణము చెప్పవలసివచ్చినపుడు ప్రస్తుతమగు నావస్తువునువిడిచి యప్రస్తుతమగు మఱియొకవస్తువునుగూర్చి విస్తరించిచెప్పుచు ప్రస్తుతవువస్తువుయొక్క గుణమును గనపరచుట. ఇప్పుడుచదువరులందరునువిని చదివి యానందించతగినదియు మహాదార్యాది గుణప్రతిపాదకమునగు మహారాజావారి చరిత్రమటుంచి చదువరులకు వినను చదువను విసువుగలుగజేయునదియు అనవసరమగునదియు నిర్గుణ ప్రతిపాదకమునగు నా మందభాగ్యుని చరితము వెల్లడిచేయుచు తద్ద్వారా శ్రీమహారాజావారి యపూర్వాదార్యాది సుగుణముల లోకవిదితములు చేయదలంచితిని గనుక ఓ చదువరులారా, కించిత్తు కాలవిళంబమగునని యోచక సావకాశముగా నిందుక్రింద సాధ్యమగునంతక్లుప్తముగా వ్రాయబడిన మదీయ చరితసాంతముగాచదివి అందు శ్రీవారి యౌదార్యాతిశయములను గ్రహించి యానందింపుడు. అదిచదివిన మీకు వీరిచరిత్రము వ్రాయుటకు నాకే కాదెవ్వరికిని శక్యముకాదన్న సంగతివిశదముకాగలదు.

నాదివిశాఖపట్ణము కాపురస్థలము మాయింటిపేరు పూడిపెద్దివారు నాపేరులింగమూర్తిపంతులు (వ్యావహారికనామము) సోమేశ్వరశర్మ (సంధ్యావందన ప్రవరనామము) భారద్వాజనగోత్రము కోనసీమద్రావిడులము ఆంగ్లేయభాషలో ననేకపరీక్షలుప్యాసయి గవర్నమెంటు సాల్టు ఆబుకారీసబు ఇన్స్పెక్టరుగా పది సం॥రము లుద్యోగముజేసి కాలవశమున దానికి విఘాతమురాగా యితరవ్యాపకమున కాలక్షేపము చేయుచున్నవాడను. వ్యాపారసంబంధమున ఇండియా, బర్మా, సిలోను దేశము లామూలాగ్రముగాదిరిగి ఆదేశముల విశేషములు జనుల దేశభాషలుఆచారములు మొదలగునవి బాగుగా నెఱుగుదును. శ్లో॥ „యస్తు

పర్యటతే దేశాన్ యస్తు సేవేత పండితాన్ తస్య విస్తారితా బుద్ధిస్తైలబిందు రివాంభసి" అన్నటుల నాకు విశేషముగా బుద్ధి కలుగకపోయినను లోక జ్ఞానము చాలామట్టుకు తెలిసినది. నాకు వివాహము కాకమునుపే పదునాలుగు సంవత్సరములు వయస్సునందప్రయత్నముగా నాయందే యొకపుత్రిక యుద్భవించినది. ఆబిడ్డపే రుభయభాషాసహజకవిత అవివాహితకన్యక తన్ను నేఁబోషింపకకున్నను తనంతన తానే వృద్ధియగుచు నన్ను విడువక వయసునఁగన్న బిడ్డలుగాని వయసునఁగూడఁబెట్టిన ధనముగాని వార్ధక్యమునఁ బనికివచ్చునన్నటుల నాకవితాకన్యక యిప్పటికిముప్పదినాలుగు సం॥రములప్రాయముగలదై శ్లో॥ "ఆషోడశాద్భవేద్బాలా తరుణీ త్రింశతా మతా। పంచపంచాశతా ప్రౌఢా భవేద్వృద్ధా తతఃపరం" అన్న శాస్త్రప్రకారము ప్రౌఢత్వమున నడుగుపెట్టి శ్లో॥ ఫలమూలాదిభిర్బాలా తరుణీ రతియోగతః ప్రేమదానాదిభిః ప్రౌఢా వృద్ధాచదృఢతాడనాత్॥ అన్నటుల తనయందవ్యాజప్రేమమును అనన్యసాధారణదాతృత్వమును గనపరుచుచున్న శ్రీమహారాజా శ్రీవెలుగోటి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రులవారినివరించి పండితంమన్యమానులును రసికాగ్రగణ్యులునగువారిని తాను తనియింపఁజాలకున్నను దీనాలాపములచేఁ దనయందు వారియనుగ్రహమును సంపాదించి తనజనకుఁడనగు నాకువయసునఁ గూడఁబెట్టిన ధనములేకున్నను బాల్యమునఁబుట్టిన కన్యతానుగనుక యిప్పుడు ప్రౌఢదశయందున్న తాను వార్ధక దశయందున్న నన్ను బోషించుటకుఁ గడఁగినది.

"ఉ॥ భూపతిఁ జంపితిన్ మగఁడు- భూరిభుజంగము చేతఁ జచ్చెఁ దా
నాపదఁ జెందియిట్టు లుద-యార్కుని పట్ణముఁ జేరి వేశ్యనై
పాపముగట్టుకొంటిఁ దన-పట్టి విటుండని చెట్టఁబట్టి సం
తాపమునొంది యగ్గిఁబడి-దగ్ధముగాకిటు గొల్లభామనై
యీపనికొప్పుకొంటి నృప-తీవగ పేటికి చల్లచిందినన్"॥

అని చల్లకుండ నెత్తిఁబెట్టుకొనిపోవుచున్న గొల్లభామ ప్రమాదవశమున తక్రఘటము భిన్నమయి కారిపోయిన మజ్జిగనుచూచి మందహాసముచే యుటచూచి పట్నపురాజేలనవ్వెదవని యడిగినప్రశ్నకు జెప్పినయుత్తరమురీతిని ఆరంభమునుంచి నేటివరకు నాయుదంతమంతయు వ్రాసిన నది యొక భారతమగును గాన నదిమాని నాకవితాకన్య శ్రీప్రభువారిని వరించిన సందర్భముమాత్రము వ్రాసెదను. ఉద్యోగముచేసిన దినములలో ననేకమంది యూరోపియ నాఫీసర్లను మెప్పించి వారివల్ల ననేక బహుమానములనుపొంది యీమధ్య చెన్నపట్ణం రివిన్యూబోర్డు ఆఫీసులో నవరేటురివిన్యూసెక్రిటరిగానుండి ప్రస్తుతము నాగపట్ణండివిజను అసిస్టంటుకమీషనరుగానున్న "R. G. A. Thompson" దొరగారివల్ల "A man of extraordinary genius" అసాధారణప్రజ్ఞగలవాడనికితాబునుపొంది కవితావిషయములో శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రాద్యనేకాంధ్ర గ్రంధకర్తయగు మచ్చ వెంకటకవిగారివలన పర్లాకిమిడి రాజసభలోను రీడింగురూములోను నిజగురువుగాఁబరిగణింపఁబడి 'కవిగురువ'ను బిరుదును, శ్రీవిరూపాక్షపీఠాధికారులగు శ్రీశంకరాచార్యస్వాములవారివలన 'అపరకాళిదాస'ను బిరుదును, మదీయాగమశాస్త్రోపాధ్యాయులును శ్రీకామేశ్వరీవుపాసకులునగు శ్రీకత్తికామేశ్వరశాస్త్రిగారివలన 'సమస్తాగమ సర్వతంత్రస్వతంత్రుఁడను బిరుదునుపొంది, బహుజనపోషకత్వమున జీవించుచుండిన నేను సుమారు రెండు సం॥రములనుంచి హరిశ్చంద్రనలయుధిష్ఠిరాదులవలె విధిప్రావితములగుకొన్ని యిడుములకు లోనయినవాడనయి తుఫానుదెబ్బతిని మహాసముద్రమున మునుగుచున్న యోడకు ద్వీపమువలె నాకెవ్వ రేదుగత కాగలరని విచారించుసమయమున నిప్పటిరాజులను మహారాజులను పరికించి వారివారియందుగల గుణాగుణములందలపోసి తనమదికెవ్వరును నచ్చనందున సమస్త సద్గుణలకాజాలాలవాలుండును అన్వర్థ

రాజగోపాలుఁడు* (రాజ+గో+పాల) నగు శ్రీరాజగోపాల మహా ప్రభువువారి గుణాతిశయములకుమెచ్చి వారిని తాను స్వయంవరింతు నని నాకవితాకన్య నాకుధైర్యముకలిగించి యీదిగువవివరించిన రీతిని వారిలోమచ్చటింపఁగడఁగినది శరణాగతరక్షణము రాజులకు నైసర్గిక ముగనుకను శరణన్నవానిని రాజు తప్పకరక్షించు నను ధైర్యముతో శరణార్థులు ముందుగారాజులయొద్ద 'శరణు' అని వారివల్ల నభయప్ర దానముగొని పిమ్మట తమయాపద నివేదింతురు. అర్జునునియొద్ద గ యుడు శరణుఁజొచ్చినవిధంబిట్టిదేగదా, అట్లనే నేనొక పెనుభూతము చే బాధింపఁబడుచుండి భూతనాధుడగు భేతాళునివలెకే యదేపేరుతో వెలసిన శ్రీభేతాళనాయనివారు వీరికివంశకర్తలు గనుక నాభూతభయ విముక్తికై తద్భయవిమోచనులగు వీరినిశరణుఁజొచ్చి తొలుపొత్త శరణాగతాష్టకమున విన్నవించితిని.

## శ ర ణా గ తా ష్ట క ము.

### అనుష్టుప్శ్లోకములు.

౧ శ్రీవెంకటగిరిఖ్యాత పూజ్యరాజ్యప్రతిష్ఠిత। రాజగోపాలయాచేంద్ర త్రాహిమాం శరణాగతం ॥ ౨. గోపాలకృష్ణటీకన్య గోపాలవ నమాశ్రయ। గోపాలకృష్ణ యాచేంద్ర త్రాహిమాం శరణాగతం ॥ 3. రాజగోపాలకృష్ణాఖ్య యాచేంద్రబిరుదప్రభ। మహారాజకృపాసింధో త్రా॥ ౪. కృష్ణాంఘ్రిపూజనేఽసక్తా కృష్ణాంఘ్రిద్వయసీరజ। కృష్ణయాచేంద్ర భూమీంద్ర త్రా॥ ౫. గోవిందకృష్ణయాచేంద్ర తాతగోవింది

* రాజ=(ఇతర) రాజులను గోజుగోవులను (గోశబ్దము పృథివ పర్యాయమును గలదు) పాల=పాలించువాడు, అనగా గోపాలుడు గోవులనెట్లు మంచిగోవులను త్రిప్పుచుండునో అట్లేతను నగుణసంపత్తిచే నితరరాజులకుమంచిమార్గము కనబరచుచున్నవారనుట.

తానుగ । గోబృందబృందకృష్ణోచ్ఛ్రిత త్రా॥ ౬. *రత్నదీపాయమానశ్రీ
వెలుగోటికులాన్వయో* రాజగోపాలరాజేంద్ర త్రా॥ ౭. వందారుజన
సందోహ శ్రితానాంసురభూరుహ । రాజాధిరాజతిలక త్రా॥ ౮. గో
పాలాంశ సముద్భూత గోపాలనసమత్సుక । గోపాలనామవిఖ్యాత
త్రాహిమాం శరణాగతం ।

పూడిపెద్దన్వయేజాతం । లింగమూర్త్యవనీసురం.
రాజగోపాలయాచేంద్ర । త్రాహిమాంశరణాగతం.

---

* రత్నదీపవత్తుచంద్రేప్యా దఽద్వయం దుగ్ధవారిధౌ ।

## స్తుతిః.

శ్లో॥ మహారాజశ్రీమన్ భువనవిచరచ్చారుయశసా విరాజన్నానా
దిక్ ద్విపనికర దంతామల రుచే । భువి శ్రీవెల్గోట్యన్వయ మణిత గో
పాల ఘృణయా భవద్వీపం మహ్యాం జలనిధి నిమజ్జత్తరణయే ॥ ౧ ॥

శ్లో॥ దివాభీతా భీతాస్త్వదసమ నగర్యాం ప్రతిదినం కులే జాతా
జాతా స్సకల మగుణాంచ జ్జనగణే।గుణానీతా నీతా స్స్వయ మిహ భ
వద్దర్శన ధియా ప్రభో గోపాల త్వం యది వససి రాజన్ స్వభవనే ॥౨॥

శ్లో । విద్వద్రాజశిఖామణే తవయశశ్శాంతా స్స్వయం భ్రామతి
శైవా లాలక నైల్యదృష్టి వశతో గంగాంచ వాణీం హసా। స్వచ్ఛాత్మీ
య సుదృష్ట గాత్రగరిమా రోదోంతరాళే నిశం వ్యాప్త్వా సంచరతి
క్రమేణ బహుధా గోపాలకృష్ణాభిధా ॥ 3।

శ్లో॥ శ్రుత్వా జస్రం తవ గుణ గణే ష్వాత్మనో యాచశబ్దా దాధి
క్యత్వం నయన యుగళా ద్వీక్షితుం శక్తిహీనః। త్వామింద్ర స్సః శతిన
తపసా నేత్రసాహస్ర మచిరా ల్లబ్ధ్వా భాతి ప్రముదితహృదా రాజగో
పాలభూప ॥ ౪॥

శ్లో॥ కస్యేయం తరుణి ప్రియో శృణు మహీపాలాగ్రణీ ఖ్యాతశే భాతి శ్రీవెలుగోటి వంశజలధౌ రాకాసుధాదీధితిః । యాచేంద్రః కరుణాంబురాశి రధికో గోపాలకృష్ణాహ్వయ । స్తస్య స్వచ్ఛ యశస్సతీతి సతతం జల్పంతి నాకే స్త్రియః ॥ ౧॥

కవిజనసామాన్యసీసపంచకస్తుతి.

సీ॥ శ్రీమదశేషవిశేషవిద్యావిగాఢత్పండితశ్రేణిపరసదనర। బహురాజ్యభారనిర్వాహదక్షీణ మతిభుజబలయుత మంత్రులమర చిత్రగుప్తసమాన చిత్రవిచిత్రలే ఖనను ప్రసిద్ధలేఖకులుండనర। కాంచనరత్నవికాసహాసితవజ్ర పీఠకాంచనరత్న పీఠదనర। పండితాగ్రణిధారణీపాల ఘనుడు। నగుచుఁ జేరోలగంబుండు నవనివిభుడు। భవ్య వెలుగోటిరాజగోపాలకృష్ణ, నామయాచేంద్రబిరుదరాణ్మౌళి కృతి॥౧॥

సీ॥ విష్ణ్వంశ చేధాత్రి వెలయును భూమిశుడనుటకు సాక్షిమీయాహ్వయంబు। ప్రజలను ప్రజలట్ల పాలించును యెకిమీ డనుటకు సాక్షిమీ యాదరణము। భోగదేవేంద్రుడు భూమానవనాథు డనుటకు సాక్షిమీ హాయగజాళి। సర్వస్వతంత్రుడు సర్వంసహాభర్త యనుటకు సాక్షిమీ యాజ్ఞలేఖ। అర్థిజనకల్పవృక్షము పార్థివుండు। భూమిననుటకు సాక్షి మీ భూరిదాన। బహుళత, వెలుగోటిరాజగోపాలకృష్ణ। నామయాచేంద్ర బిరుదరాణ్మౌళి నిజము।౨॥

సీ॥ కృష్ణరాయలు లేనికీమతోలఁగఁజేయ గృష్ణాహ్వయప్రభ విష్ణుడగుచు। సారంగధరు తండ్రిసరివిలోపముఁదీర్ప రాజశబ్దముగూడ నోజ దాల్చి। విక్రమార్కుడు లేనివెలితిపూర్తికి దాన విక్రమ శీలనవక్రముడయి। యాచకామరభూరుహ ప్రదానమునూప యాచేంద్రబిరుదవిఖ్యాతినొంది। కవులఁ బండితులనునట గాయకులను। తగినరీతిని గౌరవోద్ధతులఁ జేసి। భవ్య వెలుగోటి రాజగోపాలకృష్ణ। నామయాచేంద్రబిరుదరాణ్మౌళియొప్పు॥3॥

సీ॥ రాజత్వమన్నది రాజిల్లుమీయందఁ జైవాతృకత్వంబు సాక్షి గాఁగ। రాజత్వమన్నది రాజిల్లుమీయందఁ సామ్రాజ్యగరిమంబు సాక్షి గాఁగ। రాజత్వమన్నది రాజిల్లుమీయందఁ సౌందర్యదేహంబు సాక్షి గాఁగ। *రాజత్వమన్నది రాజిల్లుమీయందఁ సకలార్థసంసిద్ధి సాక్షి గాఁగ। రాజరాజ మహారాజ రాజవిభవ। రాజరాజాయితశ్రీవిరాజితవిభవ। భవ్యవెలుగోటి రాజగోపాలకృష్ణ। నామయాచేంద్రబిరుదరాజన్మౌళియభవ॥౪॥

సీ॥ గోపాలకృష్ణుఁడే గోపాలకృష్ణుఁడ న్భూపాలవర్యుఁడై భువి జనించి। గోపాలుఁడేరీతి గోపాలనము సేసి గోవులఁ గాపాడు కొనుచునుండు। పాపాలు తాపాలు వదయకుండఁగ నట్లు పురవాసులకు వస్తువుల నవృద్ధిఁ। దాఁ బాలుపాలుగా దయచేసి యేపార వారియోగక్షేమవార్త లెఱిఁగి। ప్రజలఁ బాలించుచును గడుఁ బ్రబలుచున్న। రాజపోలెడి రాజక రాఁడనుదురు। భవ్యవెలుగోటి రాజగోపాలకృష్ణ। నామయాచేంద్రబిరుదరాజన్మౌళిఁ బ్రబలు॥౫॥

కవికిని కంసాలికిని సీసము మెత్తనగనుక యివి కవిజనసామాన్య సీసములైనవి.

### పంచరత్నములు

ఉ॥ శ్రీలలనామనోవిపుల సీమవిహార మదాంధదైత్య ని
ర్మూలనకార భూధర సముద్ధరణైకగుణప్రచార శా
ధాలపనేందుమండలసుధారసతృప్తచకోర రాజగో
పాలమహామహీశు ననపాయమహస్థితినిమ్ము మీదయన్।

---

ర+అ+జత్వము. ర=అగ్ని (రః పుమాన్ పావకే... నానార్థరత్నమాల) అ=కారణముగాఁగల (అకారో బ్రహ్మ... గౌర కేశః పురోహితః... రత్నమాల) జత్వము=పుట్టుక. శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్ అని అగ్నిదేవు డైశ్వర్య (సకలార్థసంసిద్ధి) ప్రదాత.

ఉ॥ శ్రీపాలితభక్తజాలుఁ డరిభంజనశీలుఁడు రుక్మిణీసుహృ
ల్లోలుఁడు గోపికాధరవిలుబ్ధమనోరథ సర్వకాలుఁడా
బాలమహేంద్రజాలుఁడిల నర్థిలఁగా వెలుగోటిరాజగో
పాల మహామహీశు నన పాయసుఖస్థితిఁ జేయుఁగావుతన్ ॥

ఉ॥ శూలిహితుం డనారతవిశుద్ధమనస్కరతుండు కామినీ
జాలయుతుండు పార్థరథ సారథికత్వనిజప్రవర్తనా
మూలగుణాన్వితుండు కనుమాయక శ్రీవెలుగోటిరాజగో
పాల మహామహీశు నన పాయసుఖస్థితిఁ గాచుఁగావుతన్

ఉ॥ లాలితగోపికాధరవిలాసమదాలసమంజుగాత్ర లీ
లాలసదంబురాసముఖ లంపటకేళివిహారకృత్య జం
బాలభవాబ్ధిమగ్నకిత పన్నరుఁడీ వెలుగోటిరాజగో
పాల మహామహీశు నన పాయసుఖస్థితినుంచుఁగావుతన్ ॥

ఉ॥ మూలవిరాట్స్వరూపుఁడు ముముక్షుజనేక్షణవీక్షణాను కూ
లాలయితస్వకోటిజల జాప్తపరాపర సర్వపూర్ణతే
జోలసదాత్మదీప్తుఁడు వసుంధర శ్రీవెలుగోటిరాజగో
పాలమహామహీశు నన పాయసుఖస్థితిఁ దన్పుఁగావుతన్ ॥

ఉ॥ నాలుగుమోములాతని ఘనంబగుజాతిని పూండిపెద్దయన్
చాలవిశాలవంశమున జన్మమునొందిన లింగమూర్తినన్
నోలినిజాశ్రితాధము న హాయన శ్రీవెలుగోటి రాజగో
పాలమహామహీశు డన పాయసుఖస్థితినుంచుఁ గావుతన్ ॥

మత్తేభవ్యస్తకందగర్భసీసము.

వరమణీయాచ్ఛశుభప్రదాభరణసంరాజత్తనూసుందరాజితాం
సుకనాసికాత్తెయా శోవిరాజితకుచ కాంతాహారభూషాధరా మహాత్మ
నిజముఖాంభోరుహా నిర్గతామృతవచస్సంగీతవిద్యాప్రశంసకాస
రసమహీనిర్జర రాజపోషకగుణో త్సాహార్థికావ్యప్రదావినోది

గీ॥ విమలగుణధీర ముఖజిత హిమకర వన
దుష్టజంతుహింసక బుధ తుష్టిమహిత
శారి గజహయశుభ మహీ కాంతలసద
మల బహువిధచిహ్న నిరామయశరీర॥

ఎఱుక ॥ ఈసీసపద్యములో పెద్దపాదములు నాలుగింటిలోను మొదటి యక్షరమొకటియు తుదియక్షరములు మూడునువిడిచిచదివిన మత్తేభ వృత్తమగును. గీతపద్యములో చిట్టచివరనున్న యేడక్షరములు విడిచి కంద పద్యగణ వరుసను చదువుకొనిన కందపద్య మగును. ఈపద్య మిదివరకు నేనొనర్చిన "శ్రీసువర్చలాపరిణయ" మనుపద్యప్రబంధ కావ్య మందలి శ్రీరామమూర్తికి సంబుద్ధులతోనున్న యాశ్వాసాంతపద్యము కొంచెముమార్పుతోతీసుకొన్నాను. "నావిష్ణుః పృథ్వీపతిః" అని వీరును తదంశసంభూతులుగనుకనే యీపద్యముపనికివచ్చినది.

శకట (రథ) బంధము.

కం॥ శ్రీదా గోపాలకపా। దాదిమగురులక్ష్మ శ్రీస-హాయా శుభకృ
న్మోదాఢ్య విగతతృష్ణ । ప్రాదుర్భావ ప్రియా న-హయ చేంద్రేంద్రా॥

ఎఱుక॥ ఈబంధస్వరూప చక్రమువేసి దాని యిరుసులోని అక్షరములు చదువుకొనిన "శ్రీ గోపాలకృష్ణయాచేంద్ర" అని ప్రభువువారి పేరు వచ్చును.

వర్గపంచకరహితము.

ఉత్సాహ॥ సారసారి సారహీర- సారహాయ యశోవిశా
లా రసాస్వసారరాస్య- లాలసా రిసాహసా
హారహీర సారరైన- హాయ లాయయాహయా
శౌరిసారసాహ్వయా సు-సారశౌర్యయాశ్రయా ।

ఎఱుక॥ ఈపద్యములో కచటతప లైదువర్గులయొక్క 25 అక్షరములును లేవు. శౌరిసాహ్వయ అనునదే ప్రభువువారి పేరు. పద్యమునకున్న

నియమముచే సంతకన్న స్పష్టముగానిముడదు అర్థము సులభముగానే యున్నది గాన వ్రాయలేదు

నేను 10-1-1913 తేది సాయంకాలమున వెంకటగిరికి వెళ్లి 11 తేదిని పైశ్లోకములు పద్యములును హైస్కూలు టీచరగు అనిపిండి శ్రీరామమూర్తిపంతులు గారింట వ్రాసితిని. అప్రయత్నకృతములో సప్రయత్నకృతములో ఆయినకే తెలుసును

ఇట్లురచించిన శ్లోకములును పద్యములును శ్రీప్రభువువారికి దాఖలుచేసుకొనుచు వారిదర్శనమునే నేను గోరితినిగాని సద్యోద్రవ్య బహుమానమును కోరలేదు. అప్పటి సమయసందర్భములనుపట్టి నాకుదర్శనమిచ్చి నాతోసావకాశముగా ప్రసంగించుటకు ప్రభువువారికవకాశము లేక నాబోలు నాకు షోడశోత్తర శతార్ధపారితోషిక మొసంగిరి. ఆహా యేమి వీరిఘనౌదార్యము సాధారణముగా రాజులయొద్దకు బోవువారు సదరు రాజులకో వారి దివానులకో వారివారిమిత్రులవలన సిఫార్సులను గొనిపోయినగాని తగినసన్మానము పొందలేరన్నస్థితిలో కేవలము అకృతపరిచయుడను అనామధేయుడనగు నేను యేవొనాలుగు వెట్టిమొట్టి పద్యములను వ్రాసిపంపినంతమాత్రమున నెంతఘనముగా గారవించిరో చూడుడు భాషాపోషకులని పేరుపొందిన యొకసంఘమువారికి పదివేలరూపాయీలు తృణప్రాయముగానిచ్చిన మహానుభావులువీరేకదా నేనీపారితోషికమునకు సంతసించి కార్యాంతరముపైని నెల్లూరులోనుండగా నొకదినమున హరిహర తారతమ్య శతశ్లోకులను రెంటిని ముద్రించుటవలన ద్రవ్యము స్వల్పమైనను ఖ్యాతివిశేషముగా గలుగునుగనుక వాటిని ముద్రించిన ఖ్యాతిబొందుటకు తగినవారీప్రభువువారే యనితలచి యీక్రింది చంపకమాలికారూపమున విజ్ఞాపనమునంపుకొంటిని.

---

## సంబుద్ధి.

శా॥ శ్రీలక్ష్మీశకృపాకటాక్షకలిత-శ్రీరాజగోపాల నా
నాలంకారవిభూషితాంగవిలస-న్నారీకరాందోళనో
ల్లీలాకల్పితచామరోజ్ఝితమరు-ద్విక్షేపకించిచ్చలత్
భ్రూలత్సామ్రాదికరాజలక్షణగణీ-భూపాలచూడామణీ॥

## విజ్ఞాపనము.

చ॥ ప్రభువరలోకమందుఁగల-వైష్ణవశైవపృథఙ్మతస్థు లెం
దుభయులు నేకభావులయి-యొప్పెడివారలయందు భేదవా
గ్విభవత నెక్కుడౌ శివుడు-విష్ణునికన్నను విష్ణుడెక్కుడా
నభవునికన్న నంచుకల-హప్రియులై తమలోనఁ దామ శ్రో
త్రభరములైన వాదములు-రచ్చలనిచ్చలుఁ జేసి పక్షపా
తభయము లేక నేటికిని-తత్పరతన్ శివనింద వైష్ణవుల్
రభసత విష్ణునిందను క-రంబుగ శైవులు సేయుచుందు రి
ట్లుభయులకుం బరస్పరము-నొక్కటఁ బోరుచెలంగుచుండఁ దో
ల్లి భవమునొంది వైష్ణవకు-లీనుడొకండు దలకంచియందు స
న్నిభుడయి సాఁబయూర్తిక వ-నింగలయప్పటి శైవవైష్ణవ
ప్రభువులఁ బిల్చి వారలస-భాదగ నడ్గెను నూఱు ప్రశ్నలా
యభవుని హెచ్చుఁ జూపుచు న-వన్నియు నాకులభింప వానినేఁ
బ్రభవితసౌమ్యబుద్ధినిఁ బ-రామరికం బరికించి వానికిం
బ్రభగలయాంధ్రపద్యముల-వ్రాసి యదేవిధి వైష్ణవాళికిన్
శుభదములైన వన్నియగు-శ్లోకములన్ రచియించి సర్వతా
ట్సభలను గాని పండితుల-సన్నిధిఁ గాని రవంత యైన దో
షభయముఁ దక్కి యాంధ్రమునఁ-జక్కని పద్యములల్లి యుంచినా
డ భవదనూనశోధనకొ-డంబడఁగా నవియో వునన్న ధీ
ప్రభ నొకకొన్ని స్పష్టముగ-వ్రాసి భవత్సముఖంబుఁ జేరగా

సభయుత భక్తిశోభితను-సద్వినయం ...
యుభరితు చంద్రమౌక్తిక వ-పీశ్వర కల్ప హిమాద్రి వాక్ సుర
ప్రభుహాయ జాహ్నవీ భుజగ-రాడ్రజతాచల దేవదంతి నం
ది భువనకర్త్రవాహన ఘ-సైకృతచంద్ర తుషారరాశి స
న్నిభయశో తావకీనమగు- నేర్పు మిముంబరికించి సూరివ
ల్లభులపరీక్షకిచ్చి యవి-లక్షణవంతములై సుమంబుసౌ
రభముకవన్నె కెక్క భ్రమ-గ్రమదప్రదమైనరీతి యు
క్తిభృతశతనొప్పుచున్ మఱియు-దీక్షరసాభియుతంబులైన వా
నిభువిని సర్వదాప్రథిత-నిర్భగపద్ధతిఁ దేజరిల్ల ము
ద్రభృతికిస్వల్పవిత్తముయ-థార్థముగాసరిపోవుఁగావునన్
ద్రిభువనముల్ త్వదీయమగు-దివ్యయశోజ్జ్వలితంబులై కిశుక్
సభములభూమియందుఁగల-వారునుతింపఁగ శైవవైష్ణవ
ప్రభవులు వారివారికిన-వారితమార్గము పెంపునొందఁ తత్
సుభృతమతానుసారమతి-తోఁబఠియించుకొనంగ స్మా
ర్తభవులు వానివీనినిన-రాసరిఁజూచియభేదభావత
న్నభపరిసర్తనంబడుచ-జోద్యవుఁదీరునసచ్చొనర్చి యా
యభయమతాలవాతలకు-నోలిముదంబుఘటింపవేడెదన్॥

ఈయర్జీ 6- 4- 1918-వ తేదిని నెల్లూరునుంచి పోస్టుద్వారా పంపుకొనఁబడినది.

పిమ్మట నెల్లూరులో నేనుచేయుచున్న యితర ప్రయత్నములకు మ॥ రా॥ రా॥ యారగుడిపాటి వెంకటాచలంపంతులుగారు మిగులతోడ్పై యదిశిలవేయుటకు వారియావచ్ఛక్తిని వినియోగపర్చినను కొనసాగకున్నందున నొకరాత్రి మిగులవ్యసనమునొందినమనస్సుతో "శా॥ ఆహా మాకతి యెంతి నేసితివి" అని యారంభించి 70 చరణముల శార్దూలమాలికతో ఇష్టదేవతానమస్కృతిరొనర్చి తెల్లవారుజామున తత్పో

రణమున మరునా డీదిగువ దూలిశారూపమగు నర్జిని శ్రీప్రభువారి సముఖమునకుఁ బంపుకొంటిని.

విజ్ఞాపన శార్దూలమాలిక.

శా॥ నాకుంబుట్టిన యూర్వీశాఖపురి యం- దంబొప్పనుద్యోగవుం
బ్రాకట్యంబగు పేరుగన్న యది శ్రీ-శ్లాకిడ్మి గంజాము జి
ల్లా కంటెన్ బహుదేశముల్ నగరముల్-గ్రామంబులున్ నేర్చిరిన్
శ్లోకంబుల్ మతిపద్యముల్ నుడువనాం-ధ్రుల్ నంస్కృత ప్రాజ్ఞులు
స్తోత్ర ప్రీతిని మెచ్చ వత్సరదశో-ద్యోగంబు సాల్టాబుకా
రీకష్టంబుడిపార్టుమెంటున గవ- ర్నెంటు ర్వీసం జేసి వం
గైక ప్రాక్పటగాంగు పట్టణమునన్-యీనామ బెంగాల్ రెయిల్
వే కంపీ దొరలుల్లసిల్లగను ట్రా-ఫ్లింగాడిటర్ గా సమం
బౌ కాలంబటనుండి యంతకెరిసీ-నాయిర్ జమాల్ కంపెనీ
పేశబ్దుల్ గనిసాహెబుంగని దుబా-షీగాఁ బ్రవేశించి వ
ర్ధాకామేశ్వరరావునాయునికి బర్-హంపూర్ శిఖాకోల్ మరాం
లేకాఖ్యం దన బావపేరిటను రెం-జేస్వేల్ డిపాజిట్టుగా
పైకం బేజనిసీలకుంగొనియు నె-ప్పాయింటుమెంటిచ్చి పె
న్నా కల్లోలిని తీరమందుగలపెన్- గ్రామంబు నెల్లూరునం
దాశన్ మధ్యనొకొక్క యూర శొకయు-క్త ద్రవ్యవంతున్ గ్రమ
ప్రాకారంబుగనిల్పి యిట్లు బహుళ-వ్యాపారముం జేసి బ
ర్మా కుం గమ్మొరరాను పోను మఱిసు- ద్రా ప్రాజధానిండిపో
లాకాళ్నాడమొకంపు క్యాలికటు రెం-డానాగపట్నంబు య
ర్నాకూళంబును మూడునాలుగుగనం-దర్భానుసారంబుగా
రాకల్ పోకలనన్ సమస్తవిధమ-ర్యాదాను కూలప్రయా
ణాకుంఠస్థితిశైన ఖర్చులకు గా-నా ర్వేల్ కమీషన్ సహా
యాకల్ నష్టముబొంది చిల్లరబుణ-ప్రారాప్తి చే గుందిమొం

త్రోఁకొంచెంబగు ద్రవ్యసాయమునకేం-త్రోసిగ్గుత్రోనేటికిన్
నాకైఁ జావఁగవచ్చినాడ విధికిన్- హా లేదు కారుణ్యపుం
బాకం బెవ్వరినడ్గలే వడిగినన్- మావల్లఁగాదందు రీ
లోకంబందు ధనాఢ్యు లింతకును వా-ర్లుబ్ధుల్ ధరంగాదు నా
సాకల్యంపు దరిద్రదేవతయు వ-ర్సన్ వారివారిన్ స్వకీ
యాకారంబున వద్దువద్దని రవా-స్యాలాపముల్ సెప్పి స్వే
చ్ఛాకార్పణ్యముఁదీర్చుకొంచు నిజ మా-త్సర్యంపుఁబేర్మింగృధో
ద్రేకంబుం గనపర్చుచున్న దవుడో- ర్మిన్ దానినేనోర్చదన్
మీ కారుణ్యమొకింత గల్గినను ల-క్ష్మీపుత్రులర్ మీరు ల
క్ష్మీకాంతామణి కక్కపుత్రుడనునే-గించిత్తుదాదాపుగా
మీకు న్నాకును నిత్యమైతెలయుని-మ్మైలైనసంబంధ మీ
యాకాంక్షన్ మిము వేడఁగన్ గలదు గా-హా కైంతయున్ నాకుబల్
వీకన్ మీదుకరావలంబనముగల్గన్-దానినేనింకని
ర్భీకత్వంబునఁబారఁదోలెదను కం-పింపన్ భయభ్రాంతి యే
లా? కన్నమ్మనుపీడఁబుచ్చుటదిత-చ్ఛ్వానందురేమో సరే
నాకన్ దానికి చేతఁగాదు మతినం-సార్లివ్వరేనిం దయా
లోకభ్రూలసదీక్షణల్ వఱుపఁదా-లోలోన నూన్పించు ని
ట్లీకాటిల్యముగల్గిమెల్గునది త-ల్లెల్లాను దానిన్ వడిం
బోకార్పన్ దగునీతిమై నెగడు నీ-ముల్లోకముల్మెచ్చ దే
వాకాంతల్ దగఁగొండెముల్నుడువగా-హా, యిద్దతే తెంతు రం
తోకోపంబుననోర్తు కొక్కతెదయన్- నూతేండ్లపాయంపుదం
దోకర్త య్యాదిలచ్చియక్క మఱియుం-కొక్కర్త ప్రౌఢత్వవి
త్యాకల్పస్థితినుండువాణి రిపురం-దాల్తోల్తతిం దానిదు
ర్వ్యాకుల్ మీచెవిసోకనీకబహుమ-ర్యాదం బ్రసంగించు వా
శీకర్యాణి మృదూక్తులన్నరనవుం-డందంబుననిప్పి మ

చోప్రక వ్యాకులభావముంనవిని ఘృణా-శుంభత్స్వనస్ఫూర్తిగా
శ్రీకందర్పసమానరూపవిభవా-శ్రేయస్సాకారారంభ భూ
లోకస్వర్గధరాధినాధ కృతవి-ర్లోభాంచితానేకవు
న్యాకీర్ణస్థిరకార్య నిర్మలయశో-దారా నను౯ సర్వదా
మీకంటం గనిపెట్టుచుండి దయలో-మేల్సేతకై యర్థముం
జేకూర్పన్ మిము వేడుచుంటినిపుడా-శీర్వాదపూర్వంబుగా
భూకాంతుల్ శరణార్థిరక్షణగుణ-ప్రోద్యద్విభూషుల్ గదా
లేకస్యుల్ నను గావదక్షులెట నో-ల్లిన్ మీరలట్లోపుటన్
మీకున్ దాఖలుచేసుకొంటినికడిం-దిన్ మిక్కుటంబైనయా
శాకౌత్సిత్యముతోడము న్నమరభా-షానిర్మితంబైన సు
శ్లోకాంచచ్చరణాగతాష్టకము నా-లోకించి రీరల్ దయా
స్వాకారాయితపుణ్యమూర్తులరు ని-త్యాకృష్టమత్ప్రస్నభా
నేకార్థజ్ఞవితానమానితులరే-మేమాయభావంపుఘో
షాకాలిన్యపుటు త్తలంచనకన౯-సామాన్యు గానెంచకో
శ్రీకృష్ణాంశధరావతార కరుణా-ర్ద్రీభూతచేతోవిరా
జీకంసాయిత మత్ప్రబాధకవిరిం-చిప్రేషితార్తింనివ
ర్తీకంజప్రభవాన్వవాయజుడదూ-రీభూతసంపద్విశే
షైకప్రస్తుతసంజ్ఞితుండనయి హూ-ణానూనవాగ్ధాటిలో
నేకంబైన విలేఖనక్రమమునం-దేపారుసామర్థ్యనం
ధాకంఠస్థితశబ్దజాలవిలస-న్నైపుణ్యముంగల్గి యుం
గీకృత్యావహమనోరథక్రమప్పథ-గ్విజ్ఞాపనం బాత్మవి
ద్యాకౌశల్యముతోడఁజేసుకొనఁగన్-బ్రాప్తంబు కాదయ్యె దే
వా కందో యికిఁబెద్దపందుపుగమీ-యాస్థానమందించుక
ప్రాపీణ్యప్రతిపాదకాస్త్రదధిక-ప్రజ్ఞంబ్రదర్శించు నన్
ఛాకంటింతమనాయదృష్టమునదై-వంబట్లు శ్రీవారి హ్రా

నైకాయస్థితినప్పుడిప్పుడెపుడా-నందాత్మతన్ నిల్పి యెం
తోకాంతౌధనసంప్రదానమునకు-ద్వ్యక్తింగలింగింప సం
ఖ్యాకత్వంబున పార్థవజ్రిభిధుర-ప్రఖ్యాతధారంబుగా
రూకల్ నాకున్ సంగియింపితిరి నం-రూఢస్వకీయేంగిత
ప్రాకారాకృతిదర్శనంబెటులగు కే-నంతంత సంతోషినై
పాకారి ప్రతిపాదితప్రకృతివు-ప్ప్రవాతసంప్రీతి నెం
తోల్లుష్టప్రతిభాసమేతులగు మా-రుష్యాధముం దేగున
ట్లోకల్పద్రుమదానభూషితకరా-యూహించి యింకొక్క మా
ట్లోకాలోకపరీతకీర్తి యొక నా-త్మోభాయమానంబులై
యేకప్రాసప్రవృత్తపాదములనెం-తేశక్తినై నొక్కమా
లాకారంబున విన్నవంబొకటి పో-ప్టాక్స్క్రృతంగా భవ
చ్ఛేకత్వంబు స్వయంకవిత్వమున రా-క్షీణైకసారగ్రహా
ద్యాకత్వంబు నెఱింగినాడగనుకన్-దర్వాధుకంపించు ను
ద్రేకత్వంబున నియ్యకొంటి-నిక ల్లాహాలాసేకను
ల్లోకాతత్కర పర్వతాటవిక శా-ఖాంగాదిక నాగ వా
రాకాగుణ్యకటాక్షవీక్షణ సమా-క్రాంతక్షమా పాభవా
నాకోర్వన్ మదినివ్వటిల్లు నద ముం-ద్రాంకురత్వస్థితిన్
మీకున్ వెల్లడిసేతునియ్యెడను కుం-భీభూతనంపత్తినా
పాకంబై యనుచాలు దానం దగసం-పాదింప నేజాలునన్
శ్రీకాంతుండును బ్రహ్మదేవుడును స్వ-ర్లోకుల్ దివంబున్ భువిన్
శ్రీకంఠుండు సువర్చలాహనుమయున్-శ్రీసూర్యచంద్రుల్ సదా
లోకింతుర్గద సర్వవర్తనములన్-లోకంబులో నెల్లన
ప్రకాశించెడువ్యాసపారికులు పా-టించుగ్దా వృద్ధియున్
దాకట్టిం దమరిచ్చునట్టి బుఃనొ-త్తంబున్ సరాసగ్లగా
నాకున్ సాధ్వీభూచరాస్తు లడమా-నంబివ్వగా లేవు నా

లీక ప్రస్ఫుట వేగసంకలిత వా-గ్లీలావిహారైహికా
మూకత్వాంచిత గర్వ వర్జిత బృహత్-భూషానపాయాత్మవి
ద్యాకాయంబును సత్యనిత్యతయునా-యాస్తుల్ గలుంగన్ జనా
నీకస్తుత్య పవిత్రవర్తనుఁడ చిం-తింపంగ సత్పాత్రదా
నైకాహర్ణండ నపూర్వమైనఋణదా-నౌదార్యమున్ జూపిమీ
రాకంజాప్తవసుధా మయూఖు లిరువుర్- హాసాత్ములైనిల్వ నా
నా కాకుబ్గజ ఘంటికా రవిత సం-తాన ప్రదానోపమ
శ్లోకవ్యాప్తినిఁ బొందవేడెదను ని-ర్లోభాయమానప్రభూ
లోకాతీత విచిత్రరూప ఋణమీ- లోకంబునందెవ్వరీ
నాకుం జాలుదు రీరుదక్క నది దా-నప్రాయమిం చీరలన్
నాకంఠార్పితమై యొసంగునొక షా-నర్టేయుకర్ణాతిభా
రైకంబంచును నేఁదలంచవలెగా-నౌచిత్యతాభావనం
శ్లీకంబిత్యాదిపూర్తిచేసినసుర-క్షింపంగ బ్రార్థించెదన్
నాకాదున్నతగోపుర ప్రతతికాం-తత్సౌధసంవృత్తస్ఫుర
త్ప్రాకార ప్రతిభా ధగద్ధగిత స-ద్రాణ్మందిర స్థండిరా
నేకాత్మీయ గుణావలంబన తనూ-శృంగారభృంగాలకా
లీకల్యాణ నృపాంకదావ్యకృతి సం-లీనాంగ వెగ్గోటిసం
శాకూపారసుధాకరోదయమహీ-శా రాజగోపాల కృ
ష్ణాకంజాతయుగార్చనోత్సుకసుధీ-యాచేంద్రభూపాల ది
వ్యాకీర్ణాత్మయశోవిశాల కవికా-వ్యశ్రోత్రభూషా ర్థిస
న్నాకానోకహ భోజరాయలటులుం-డన్నేటికిన్ మీరుత
ద్రాకాపూర్ణసుధాంశకీర్తులకు స-ద్భాగ్యంబునంగంటిమి
మ్మాకాలంబునవారలిచ్చిరటరూ- క్కాలక్షయొక్కొక్క శా
శ్లోకాంతర్గత సర్వవర్ణములకున్-సూర్యర్పితైకైకప
ద్యాకృత్ప్రస్తుతులన్ స్వయంగ్రహణశ-క్త్యక్షీణదత్తుల్ భళీ

యీకాలంబున నున్న భూపతులలో-నేవిన్న వారెల్లవి
ద్యాక్రమప్రఫలాంతరస్థితరస-ఖ్యాతాతిమాధుర్యముల్
గాకోలప్రతిమంబు గాఁగొనెడివా-ర్గాకిట్లు మీయట్లు శ్ర
ద్ధాకాతూహలభావతన్ స్వయముగా-దానిన్ విమర్శించి పి
ణ్యాకంబట్లుగ దోషజాలము పరి-త్యక్తంబు గావించి రా
సైకద్రావకముల్ గ్రహించెడిధరా-దీశుల్ మఱేరీ మహా
త్మా కాచప్రదరీతినాడుఘన మి-ద్ధాపాటిగానున్న నీ
మీకున్ లక్ష్యమె? యక్షరంబునకు నే-మీ యొక్క రూపాయిగా
నాకొన్నట్టిమనుష్యమాత్రునకు నో-నన్న ప్రదానంబు పు
ణ్యాకంబై విలసిల్లుగాక మఱియు-న్యంబట్లు గానేర్చునే
నాకన్నుంగవయాన గానిది ప్రమా-ణంబైనదింగాన ని
త్వాకుశ్రేష్ఠనృపాలకోపమ- పరీతత్వప్రస్తుతప్రాభవా
మీకున్ మీఘనదృష్టి కెంతయునొగిన్-మీమాంసకుల్ గానిదా
పైకంబప్పనగంగ వేఁడదఁ బ్రభూ-వాక్యస్వసిద్ధాగదా
ప్రాకుం జేరి దరిద్రుడొక్కఁడుగదం-బ్రాల్మాలి దైన్యంబుతో
నాకుల్ రేఁడనుగంగ జూచినక్రియన్-హా! యేమి సేతున్ మదీ
యైకంబైన శరణ్య మీరలగుటన్-హీనస్థితిన్ రెండువేల్
రూకల్ నాకిపు డప్పుగా నొసగినన్-రూఢిన్ మఱా రెల్లకున్
నాకా శల్యతఁ జూపుచున్ మఱలమీ-నాణెంబులన్ మీకునే
డాకల్ చేసుకొనంగజాలు దనవ-ద్యంబైన యీలేఖయే
తాకట్టందుకు విచ్చివ్రాతయని సం-తాపంబునుం జెంద కం
గీకారంబుగణించి విన్నపమునం-గించి త్ప్రబద్ధంబులే
దోకంకేరవ దేవదంతిమాయ క-ర్పూరోర్వీరుహహారహార్యరాట్
శ్రీకైలాస వియన్నదీ కుధరభిత్-శ్రీకంఠ నందీశ తా
రాకాంతద్యుతిమద్యశఃకలిత సు-త్రామప్రతాపప్రభా

నాకోర్వ్యానఫలంబు సేయుటకుదీ-నంపుం బ్రలాపంబులన్
మీకు న్నాపై జాలిపుట్టువరకున్-మేకొన్చి సల్లస్మదీ
150 న్యైక ప్రాథమి కాత్మ జాశుకవితా-స్వాలాపముల్ విన్బడన్॥

## విజ్ఞాపనాష్టకం.

౧. శ్లో॥ శ్రీవేంకటేశ సుధాపయోనిధిశశిన్ శ్రీరాజగోపాలభూ
పాల ప్రాజ్ఞసుధీః రీణ్యాకృత కావ్యాలోకనే లోలభో । నానాదిగ్విలసత్
స్వకీయ విమల శ్లోకప్రభా జాల మాహేంద్రప్రాభవ సర్వసద్గుణగణ
భ్రాజత్సుశీలప్రభో॥ ౨। గత్వాగత్వా బహుజనపదాన్ పోషకాన్వే
షణేచ్ఛా భావేనాహం క్వమపి జగతౌ ప్రాప్తవాన్ నాస్మి రాజన్ । త్వాం
భాషాపోషకబిరుదః భ్రాజమానం హి నూనం శ్రుత్వా ద్రష్టుం బహుతర
ముదా చాగతోఽత్ర క్షితీ రాజన్॥ ౩॥ పురా కాంచీపుర్యాం ప్రబలతర
వైషమ్యాను భియాః ప్రమాదస్త్వేభ్యో పృథగనుచ రాస్సంతతమహో ఽపి । శి
వస్యైనోత్కృష్ట్యే దూషణాయు దినం కర్తుంమనసా వివాదప్రాబల్యంను
ఘటసపటిష్ఠాః ఖలు సదా॥ ౪। శివాధిక్యం సూచచ్ఛతకమకరోద్వైష్ణ
వమణి హరరాజాదయశ్చా స్వగుణమహిమా సంస్కృతగిరి । శతా
నాం శ్లోకానాం సముచితః భావాంధ్రకవితా విధానే పద్యానామకరవ
మిహైకం హి శతకః॥ ౫। విష్ణో రాధిక్యసూచచ్ఛతకమకరవం వై
ష్ణవానాంహితార్థం సర్వాస్తే శ్లోకరూపం తదనుగుణవిధా నాంధ్రపద్యై
స్సహాద్య । ఇత్థం సర్వ సహిత్వా శతః చతురభూత్ శ్లోకపద్యాభియు
క్తో గ్రంథోఽయం సంభవిష్యత్యధికతరముదావాప్తిహేతుర్బుధానాం॥
౬॥ శ్లోకానాంద్విశతా మదీయరచితా వాంధ్ర పశ్చాత్సతః పద్యా
నాంద్విశతా సమాహితధియా ముద్రాపితుం కాంక్షయా । భూమౌవై
ష్ణవశైవజాల హితకామాహంలఘుత్వాంచిత వ్యాఖ్యానేనసహ భువి
ప్రకటనంకర్తుం హి సన్నిశ్చయః। ౭। యుష్మత్సాహాయ్య మధునా ప్ర

భువరవిస్మయాద్యాచితం ద్రవ్యరూపం టంకానాం వింశతీనామధికృతశతకం దేవ దాతవ్యమత్ర । తస్మాత్సర్వతయిుష్మత్ పుంతరవిలసత్ సద్యశః ప్రౌఢకాంతా దిక్షు స్వేచ్ఛావిహారం ముదితహృదికరిష్యత్యజస్రం స్వదీప్త్యా॥ ౮॥ ఆంధ్రౌ షట్త్రింశతిపదయుతా మాలికా ప్రేషితాహి క్ష్మోణీంద్ర త్వత్సముఖమధిగచ్ఛతామనుత్కృష్టగ్రంథా । శ్రోత్రానందం ప్రతితుమపి సంకర్తుమిచ్ఛామి రాజన్ దాతవ్యం మే సమయమధికా దాదరాద్విద్వదార్త్యై।

పై వివరించిన మాలికారూపములగు నారెండర్జీలు శ్రీప్రభువువారియొద్ద నిలవలోనున్నవి. గీర్వాణభాషయం దిగనదన వ్యంజనాత్కురమును ఆంధ్రవర్ణగుణితమున లాకేత్వము దాకుంగొమ్మును వంశపారంపర్యముగా నెఱుగకుండుట ప్రభువుల సర్వజ్ఞత్వమునకు లోపమైనను వారియౌదార్యమునకు భూషణమైనదన్న మాట నేనెఱుగుదును గావున మరికొన్నాళ్లకు నేను వెంకటగిరికేగి పై సంస్కృత విజ్ఞాపనాష్టకమున నొకయర్జీనిగూర్చి జ్ఞాపకముసేయగా తక్షణమే హరిహర తారతమ్యశతశ్లోకి ప్రౌఢకావ్య కర్త్యకకు శతమానప్రదానం బొసరించిరి. తత్కన్యాపల్కగృహీత నగు నేను

క॥ శ్రీమద్వేంకటోర్వ్యావ్యయ! కోమలహిమధామ రాజ-గోపాలమహా
భూమీపాల కవీశ్వర! కామితఫలసంప్రదాయ-కా సుగుణౌకా

సీ॥ దేవాముఖ్యము నూఱు రూప్యములు ము-ద్రింపఁదమదీయూసము
ప్రాపిణ్యా ప్రతిపాదనంబు లగు స-ద్గ్రంథంబుఁ దమీయశ
శ్రీవర్ధిల్లుతఁ బోయువచ్చెదను ము-ద్రింపించి కాపీలతో
సేవత్తుఁ భవదీయసన్నిధికి నెం-తేఁ ప్రీతిఁ బత్తావధిఁ॥

అని యొకవిజ్ఞాపన మొనరించి వచ్చినాడను రెండవ పెద్దయర్జీనిగూర్చి నేజ్ఞాపకము సేయకయే ప్రభువువారి చిత్తానుసారముగ పర్యవసానమున కెదురుచూచుచున్నవాడ శ్రీప్రభువువారు సకుటుంబ సపరివార క్షేమ

ష్నైన్య నిజ భాగ్య యాయు రారో గ్యైశ్వర్యాభివృద్ధిని చిరంజీవులై ప్రబలుచుందురుగాక. సమస్త మంగళాని భవంతు. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

తిరుపతి.
10—7—1913.

పూడిపెద్ది లింగమూర్తి పంతులు
విశాఖపట్టణము.

ఇష్టదేవతాప్రార్థనము

శా॥ ఆహా! మారుతి యెంత సేసితివి నిన్-న్నత్యంతమాభక్తితో
నాహార్నిశ్యబహిర్రహస్సకలమ-ద్వ్యాప్యపారకృత్యంబులం
దూహింతుంగద తోడునీవయనియెం-తో నమ్మికన్ నాదునీ
యూహాస్వ్నవయెఱుంగు దద్దియుఁగడున్-హీనంబహీనంబొ యి
ట్లాహంకారపుదృష్టిఁజూచుటిదియ-న్యాయంబు స్వామీ భవన్
మాహాత్మ్యంబుజగత్ప్రసిద్ధవరమా-మ్నాయాయితంబై సదా
హాహా హూ కిన్నర సిద్ధ కింపురుష సాధ్యాదిస్వరావాస సం
దోహాధ్యాసరలోకకీర్త్యము సుధాం-ధోనాధుడేసిబదా
సోహమ్మ్యాం ముఁజరించుచునిచ్చలన నం-హాళ్వుంజపింప్రైకడు
ర్మోహాంధీకృతమానవానమభవాం-భోరాశినిర్మగ్నసం
దేహాన్యాంతచలక్రమాక్రమితదు-ర్ధీయుక్స్వభావాన్మదీ
యైహిక్యాతిపిన్కృష్టదాస్యమవహా-స్యైకాస్పదప్రాయమో
హాహాహో కాక పరిగ్రహింపఁబడఁ దా-యోగ్యంబుగాఁజాలునే
యూహాపోహాలులేనిమూఢుడను సు-మ్మో దేవదేవా మహా
మోహాపాపినిదుష్టవర్తనుడనన్-మన్నించిరక్షించుటే
వైహాయుఃపథభూచరన్మునిజన-ప్రస్తుత్యసత్కీర్తియా
నాహంకర్తృనభోక్తృభావనిగత-స్వాంతైకవేదాంతవి
న్మాహావాక్యపదార్థతత్వానుబకం-త ద్వ్యాఖ్యకారుండవై
నాహంప్రాపనవిన్మాపించుఖరదం-ష్ట్రాళ్ క వాలలీలాయిత
ప్రాహారప్రక్కృతుల్ నిజాయుధములై-పర్వన్ సమావ్యాప్తలం
కాహర్మ్యాల్మవిహారదైత్యనికరాం-గస్థానువర్తుండవై

యాహీనాత్మవిభూష ణాజ హారి ది - వ్యాస్త్రప్రతీకారసీ
రాహీనప్రతిభా ప్రభావ రణశూ - రాగ్రేసరోద్భాసివై
యాహాకార రవ త్పురీజనసము - ద్యద్భుజ్ఞిరీత్యాస్థితిన్
బాహాబా హిసమీకమందడంచితా - పాతాళలంకేశ్వరున్
రాహుస్మట్టితి ఖానుఁబట్టితివి ధై - ర్యస్థైర్యశౌర్యాండవై
స్నేహాంబరర్కజరామ భద్రులకునం - సిద్ధంబు గావించి యా
గ్రాహాస్థానము నూఱు యోజనములన్ - గవ్యాంఘ్రిపల్లీలమై
గ్రాహాస్థానపథా శ్రమాచరితవే - గప్రస్ఫురల్లంఘనం
బాహాహాయనితోటి వారుగనియ - త్యాశ్చర్యముంబొందగా
స్వాహాంపుర్విశఁ జేసి సీతగని య - వ్వామాక్షి సేమంబుచూ
డాహీరంబును దెచ్చి రామునకుజా - డల్ దెల్పియాకొల్పియ
వ్యాహ్వాచ్ఛక్తిని మేటివై నలునిచే - సంభోధిఁ గట్టించి నీ
వాహిన్యాళినిలంకఁ జేర్చి దనుజ - వ్రాతంబుతో రావణున్
దేహాంతంబొనరించె రాముడనిప్పు - ద్వీజాతకుంజెప్పి యెం
తో హానంబొదవించి రామునకుసం - తోషంబు పుట్టించి దు
స్సాహాత్యాంచిత తద్వియోగమునకున్ - సంధించియంతంబు భూ
వాహాత్వ ప్రతిసూచకాంకమగుత - త్పట్టాభిషేకోత్సవా
ధ్యాహారద్ధృదయప్రమోదమునఁబ - త్యంగీకృతిన్ దద్వరా
రోహాదత్తమణీయహారవిలస - ద్రూఢింబ్రకాశింపవ్రా
మాహీజానియు నీవు కేవలమహా - మాయానమాధీనన
న్నాహాత్మీయకృతావతారుల రమం - దస్తుత్యలింగాని యు
త్సాహాత్వబునసద్గజాలరిలమీ - దైవప్రభావంబులన్
స్వాహాభర్తృశశి ప్రభాకర దృగం - శశ్రీరామకార్యార్థమా
సాహాయ్యప్రతిపాదకత్వమునకై - సర్వంసహాభారకృత్
బాహావింశతి పంక్తికంధర వధా - వశ్యప్రవర్త్యత్వని

ర్వ్యాహాత్వ బున సంభవిమ్య దజ సం-భావస్థితిన్ సేవక
పుహ్యాహా ప్రార్థితసా సంఘటనకున్-భూమిం బ్లసంగాక్రతిన్
దేహంబున్ ధరియించి నిల్చితివి ప్రీ-తిన్ దక్షిణా భోగతీ
రాహార్యోత్తము గంధమాదనముపై-నక్రాంత మొందాకనై
దేహీ కాంతు ననంత తారకపవి-త్రీభూతనామంబు నం
హాో హారంబగు రామసత్కథయునీ-యుర్విం బ్రవర్తిల్లునో
హాహా కాలనిజస్వరూప ధరణిన్-మాబోంట్లకుం దాక సౌ
ఖ్యాహా రాయురనంత రైనుతసమా-హారాది సంపల్లసత్
గేహాస్థైర్య సతీసమాగమ సుఖో-ద్దీప్తింబొసంగింతు వా
రాహాస్యాగమశాస్త్రకృత్తమ కుచున్-రాజిల్లుచున్నట్టియు
ద్వాహాంపుం దరువాతి పావకపవి-త్రంబౌ కథాభాగమున్
బాహాటంబుగ బూర్తిసేయననినా-పైంగోపమా దేవ దా
త్వ్యాహం బంబునకన్నప్రదానమునకెం-తో దీక్షతో నుండి వా
ర్వ్యాహా ఘూగమనంబుగోరుగద మ-త్ప్రాయత్న సంపూర్తికై
ల్లోహార్యక్షసనామహీరసుత యో-న్నోన్ని వాళ్లనివ్వేడ బ్ర
గ్రాహంబుం గోసి సైంధవోత్తమపునం-రంభంబు మాన్పించిన
స్త్రీహేయంబగు దీనసంస్థితికిన-న్నేలావడిం జెచ్చినా
వీహాన్యంబుధి నన్ను ముంచి యది మా-న్పింపం దలంతేని ది
గ్వ్యాహారస్థితి కక్క-ధెట్లునను గ - న్కన్ ఖ్యాతికిన్ బ్రీతితే
దా హుంకారమదేల శాంతిగను నా-తప్పేమి యోనా మిఘట్
స్వాహాకారత రూపుమాపుమికన - స్వద్దైన్యమున్ సర్వని
ర్వ్యాహాత్వప్రతిభాయమానుడగునా - రుద్రుండు నీవేకదా
ఆహారాంబక దేవుడున్నతియునీ - వైయుంట స్పష్టంబు దే
వా హాయిన్ మదపేక్షితార్థఘనసం-ప్రాప్తిం బొసంగించుమా॥

శ్రీమదుమారమణపరబ్రహ్మణే నమః.



# హరిహరతారతమ్య శతశ్లోకీ



## ఆంధ్రపద్యలఘుతాత్పర్యసహితము

శ్లో॥ వృద్ధాన్ శ్రుతిస్మృతిపురాణవిశేషభాషా నిశ్శంకబుద్ధికుశలాన్
ప్రణిపత్య సత్యం। అద్వైతమేకమజడం శ్రితభేదబుద్ధిః పృచ్ఛామ్య
హం హరిహరస్థితతారతమ్యం ॥

ఉ॥ శ్రద్ధమెయిన్ శ్రుతిస్మృతిపు - రాణవిశేషవచోవిరుద్ధవాక్
పద్ధతులైన పెద్దలకు - వందనముల్ పచరించి భేదసం
విద్ధనిషిద్ధబుద్ధినయి - వేఁడెదఁ దెల్పఁగ నేక నిర్జడ
త్వేద్ధజగత్ప్రసిద్ధమగు - నీశ్వరకేశవతారతమ్యమున్॥

తా॥ అద్వైతబుద్ధిచేత భేదములేక యేకనిర్జడత్వభావము నే నొప్పుచున్నను, భేదబుద్ధిఁ గల్పించుకొన్నవాఁడనై, హరిహరులయందలి తారతమ్యమును తెల్పఁగోరి శ్రుతిస్మృతిపురాణాదులయందు విశేషపరిశ్రమగల పెద్దలను నమస్కారపూర్వకంబుగా నీక్రింద చెప్పఁబోవు ప్రశ్నలనడుగుచున్నాను.

ప్రశ్న ౧.

శ్లో॥ ఏకస్సముద్రసలిలే వటపత్రశాయీ యాచాన్య స్సముద్రశరధిస్త్రిపు
రఘ్నభేదే। కో వానయోరధిక ఇత్యనుచింత్య వృద్ధాస్సత్యం బ్రువం
తు వయమేవ తమాశ్రయామః ॥ 1.

# హరిహరతారతమ్యశతశ్లోకీ.

ఉ॥ ఒక్కడు సాగరాంబువుల - నోలిఁబరుండును మఱ్ఱియాకుపై
నొక్కనికబ్ధితూణమయి - యొప్పెఁబురత్రయభేదనంబునం
దెక్కుడువాడెవండొ మది - నెంచి వచింపుడు పెద్దలార పెం
పెక్కసభ క్తితోడభజి - యింతమువానిన యెల్లవారమున్॥

తా॥ ఒకడు (విష్ణువు) సముద్రముమీద మఱ్ఱియాకుపైని పరుండును. వేఱొకడు (శివుడు) ఆసముద్రమునే అమ్ములపొదిగా ధరించినవాడు. ఈయిద్దరిలో నెక్కువవాడెవ్వడో బాగుగనాలోచించిచెప్పుడో పెద్దలారా, వానినే మనమందఱము భజింతము.

ఎఱుక:— ఇకముందు ప్రతిశ్లోకమున పూర్వార్థము మాత్రము చెప్పబడును. "కోవానయోరధిక ఇత్యనుచింత్యవృద్ధాస్సత్యం బ్రువంతు వయమేవతమాశ్రయామః" అను ప్రశ్నరూపకమైన యుత్తరార్థమును కలిపిచదువుకోవలెను. అట్లనే ప్రతిపద్యములోను మొదటి రెండుచరణములుమాత్రమే చెప్పబడును. "ఎక్కుడువాడెవండొ మది నెంచివచింపుడు పెద్దలార పెం-పెక్కసభక్తితోడభజియింతము వానిన యెల్లవారమున్" అను ప్రశ్నరూపకమైన కడమ రెండుచరణములు కలిపిచదువుకోవలెను.

శ్లో॥ ఏకోభుజంగశయనే స్వపితీహనిత్యం చాన్యోభుజంగకటకో న
టతీహనిత్యం। కోవానయోరధిక॥ 2.

ఉ॥ ఒక్కడు శేషశాయియయి- యొప్పెడు నెప్పుడు లోకమందు, వే
ఱొక్కడు శేషభూషుడయి-యొప్పెడుఁదత్కటకాప్తిచేత, నిం-
దెక్కుడువాడెవండొ ।

తా॥ ఒకడు (విష్ణువు) సర్పశయ్యయందు పండుకొనువాడు. వేఱొకడు (శివుడు) సర్పమునే కడియముగా ధరించుకొన్నవాడు. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ మానుంచకార చతురాననమేకమేకమన్యాంతంచకార చతురానన
మేవపేకః॥ కోవానయోరధిక ॥ 3.

ఉ॥ ఒక్కడు దానొనర్చుకొని- నొక్కసుతుండుగ బ్రహ్మదేవు, నిం
కొక్కడు దానొనర్చుకొని - నొక్కటసారథిగాగ బ్రహ్మ, నిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) బ్రహ్మదేవుని కుమారుడు గాగలవాడు వేఱొకడు (శివుడు) బ్రహ్మదేవుడు రథసారథిగాగలవాడు వీరిద్దరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకః పునర్బ్యవిదధౌ నవనీతఖండం చాన్యోదధౌ నవసుధామయ
చంద్రఖండం। కోవానయోరధిక ॥ 4.

ఉ॥ ఒక్కడు చేధరించెభువి - నొప్పగ దానవనీతఖండ మిం
కొక్కడు దాధరించెదివి నొప్పసుధామయ చంద్రఖండ మిం
దెక్కుడువాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) వెన్నను చేతధరించెను వేఱొకడు శివుడు (శాశ్వతమైన) చంద్రఖండమును తలధరించెను వీరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకో స్తినందకుటిల వ్రజమందిరేషు చాన్యోస్తి మేరుశిఖరస్థిత కం
దరేషు। కోవానయోరధిక ॥ 5.

ఉ॥ ఒక్కడుసంచరించును వ్ర- జోచితనందుని మందిరంబులం
దొక్కడు సంచరించును సు- రోచితమేరుసుకందరంబులం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) గొల్లపల్లెలో నందునియిండ్లలో తిరుగువాడు మఱియొకడు (శివుడు) మేరుపర్వతశిఖరమందున్న గుహలలో దిరుగువాడు. వీరిద్దరిలో నెక్కుడు వాడెవడు.

శ్లో॥ ఏకస్సహస్రకమలైర్యముపార్చ్యతస్థౌ చాన్యస్తుతేరుపచితస్సహ
మోదతేస్మ। కోవానయోరధిక ॥ 6.

ఉ॥ ఒక్కడువేయిపద్మముల- నొక్కనికిందగఁబూజచేసె వే
ఱొక్కడువానిపూజలకు - నుత్సుకుడై వరమిచ్చె మెచ్చి, యిం
దెక్కుడువాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) వేయిపద్మములచేతనొకనిఁ (శివుని) బూజచేసెను. మఱియొకడు (శివుడు) అట్లు పూజింపబడి ప్రీతుడై మెచ్చివరమిచ్చెను. వీరిద్దరిలో నెక్కువ వాడెవడు.

శ్లో॥ గాఢాంధకారసమనీలశరీర ఏకో జ్యోత్స్నాతినిర్మలవిశుద్ధశరీర
ఏకః। కో వానయోరధిక ॥ 7.

ఉ॥ ఒక్కడునీలదేహమున - నొప్పెడు గాఢతమంబుచాడ్కి వే
ఱొక్కడుశుభ్రదేహమున - నొప్పెడుఁబున్నమవెన్నెలట్లు వీం
డెక్కుడువాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) గాఢాంధకారమువలె నల్లనిశరీరముకలవాడు. మఱియొకడు (శివుడు) పున్నమనాటివెన్నెలవలె స్వచ్ఛమైన శరీరముగలవాడు. వీ రిద్దరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకః కుమారమభజ త్సుతరామనంగం అన్యః ప్రయాతి కిల శక్తిధ
రం కుమారం। కో వానయోరధిక ॥ 8.

ఉ॥ ఒక్కడనంగుడై సుతు - నొక్కనిఁదాఁగనినంతసిల్లువే
ఱొక్కడుశక్తిమంతుఁడగు - నొక్కసుతుంగని యూరకుండు వీం
డెక్కుడువాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) శరీరములేనికుమారుని (మన్మథుని) గని సంతసించుచుండును మఱియొక్కడు (శివుడు) శక్తియుక్తుండగు కుమారుని (కుమారస్వామిని) గని నిర్లక్ష్యముగా నుండువాడు. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ స్త్రీరూపమాప కిల పూర్వమభీష్టమేక శ్చాన్య స్తమేవ వితరామ
భజత్స్వరత్యై। కో వానయోరధిక ॥ 9.

ఉ॥ ఒక్కడునాతిరూపుగొని - నొక్కటమున్నతనంతనిచ్చమె
నొక్కడుపూరుషక్రియల - నుత్సుకుడై రమియించెవానితో
నెక్కుడువాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) పూర్వమెప్పుడో యిష్టమైనందున తనంతట తానే స్త్రీరూపము ధరించెను. మఱియొకడు (శివుడు) ఆస్త్రీరూపధారియైనవానితోనే క్రీడించెను. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ మృష్టాతివల్లవగృహేనవనీతమేకః శ్చ్యావ్యోదదాతి సుధియాంపర మామృతం తత్। కోవానయోరధికః ॥ 10.

ఉ॥ ఒక్కడు వెన్న దొంగిలును - శాశ్వతుడై భువిగొల్లయిండ్ల వే
ఱొక్కడు దేవతావళికి - నూనసుధారసమెప్పుడిచ్చు నిం
దెక్కుడు వాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) గొల్లలయిండ్ల నవనీతము (వెన్న) ను దొంగిలించువాడు. మఱియొకడు (శివుడు) దేవతలకు పరమామృతము నెప్పుడునిచ్చుచుండువాడు. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకః ప్రియాభిహితకామ ఇతి ప్రసిద్ధి శ్చాన్యః ప్రియాభిహతకామ ఇతి ప్రసిద్ధిః। కోవానయోరధికః ॥ 11.

ఉ॥ ఒక్కడు లోకమందు వెల - యుం హితకాముడనం బ్రసిద్ధుడై
యొక్కడు లోకమందు వెల - యున్ హతకాముడనం బ్రసిద్ధుడై
యెక్కుడు వాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) హితకాముడు (మన్మథుని కిలాంగి వానినుత్పాదించి హితుడగువాడు) అని లోకప్రసిద్ధుడు. మఱియొకడు (శివుడు) హతకాముడు (మన్మథుని బత్య పెట్టకవానిని బరిమార్చినవాడు) అని లోకప్రసిద్ధుడు. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకస్యజాత ఇతిసంతతలోకవార్తా నాన్యస్య తాదృశవిదూషిత లోకవార్తా। కోవానయోరధికః ॥ 12.

ఉ॥ ఒక్కడు పుట్టుచుండునని - యొప్పెడు సంతతలోకవార్తచే
నొక్కని కట్టిదూషితపు - టుక్తి చెలంగదు లోకవార్తచే
నెక్కుడు వాడెవండొ ॥

తా॥ ఒకనికి (విష్ణువునకు) లోకమందు పుట్టువు గలవాడని వాడుక గలదు. మఱియొకనికి (శివునికి) అట్టినింద్యమగు వాడుక లేదు అనగా పుట్టువు లేనివాడనుట. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకస్యవాగ్దుషిక జీవనవృత్తిరాసీ దన్యస్య సర్వబహుభాగ్యదవృత్తిరాసీత్। కోవానయోరధికః ॥ 13.

ఉ॥ ఒక్కఁడు నివృత్తి విత్తమున - కొప్పఁగ వడ్డి గ్రహించుచుంట వే
ఱొక్కఁడు నివృత్తి యందఱికి - నూఱికవిత్త మొసంగుచుంట యిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) వడ్డీవ్యాపారమునేయు వృత్తిగలవాఁడు. వేఱొకఁడు (శివుఁడు) అందరికి నూఱికయే ధనమిచ్చువాఁడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు. (కృష్ణావతారమునందు నియ్యుట నందుఁడు గుణనాతివైశ్యుఁడు. వీనివృత్తి వడ్డీవ్యాపారము.)

శ్లో॥ ఏకస్తు బాణగతిమేత్య కరే ప్రవిష్టశ్చాన్యోక్షుతత్పురజయాయతమేవ బాణం। కోవానయోరధిక॥ 14.

ఉ॥ ఒక్కఁడు బాణమై యొకని - యుత్తమహస్తమునందునిల్వ వే
ఱొక్కఁడు దానిఁ బూర్జయము - నొందుటకై వడిఁ జిమ్మెనై చె నిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) బాణమై (శివుని) చేతిలోనిమిడినాఁడు. వేఱొకఁడు (శివుఁడు) త్రిపురములను జయించుటకు ఆ (విష్ణు) బాణమునే చిమ్మివైచెను. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకో విభాతి రవిచంద్రమయుక్వినేత్ర శ్చాన్యోరవీందుశిఖిరూపఘనత్రినేత్రః। కోవానయోరధిక॥ 15.

ఉ॥ ఒక్కఁడు సూర్యచంద్రనయ - నోచితమాకనుదోయివాఁడు వే
ఱొక్కఁడు సూర్యచంద్రదహ - నోజ్జ్వలమానయనత్రయంబు వాఁ
డెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) సూర్యచంద్రులను రెండునేత్రములుగలవాఁడు వేఱొకఁడు (శివుఁడు) సూర్యచంద్రాగ్నులను మూఁడునేత్రములుగలవాఁడు వీరిద్దఱిలో నెక్కుఁడువాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్సదా సవితృమండలమధ్యవర్తీ చాన్యస్తు తత్సవితృదంతభిదా పటీయాన్। కోవానయోరధిక॥ 16.

ఉ॥ ఒక్కఁడు సంచరించుఁగద - యొక్కయెడన్ రవిమండలంబునం
దొక్కఁడు నిక్కసేసెఁదవ - యుక్కున రవిదంతభంగమిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) సూర్యమండలమున సంచరించువాడు. మఱియొకడు (శివుడు) ఆసూర్యునిపండ్లు విఱుగఁగొట్టినవాడు. వీరిద్దఱిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకస్తుదీనగజరక్షణదత్తబుద్ధి శ్చాన్యస్తు మత్తగజశిక్షణదత్తబుద్ధిః।
కో వానయోరధిక ॥ 17.

ఉ॥ ఒక్కనిబుద్ధిదీనగజ - మున్నతిరక్షణసేతయందు వే
ఱొక్కనిబుద్ధిమత్తగజ - ముద్ధతిశిక్షణసేతయందు నిం
దెక్కుడువాడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) దీనమైనగజమునురక్షించినవాడు. మఱియొకడు (శివుడు) మదించినగజమును శిక్షించినవాడు వీరిద్దఱిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ గోపాలకృత్యమధిగమ్య విభాతిచైక స్త్వన్యో వృషాధిపతినాయక ఇత్యగాయి। కో వానయోరధిక । 18.

ఉ॥ ఒక్కడుకీర్తివొందుభువి - నోపినగోపరిపాలకుండు నా
నొక్కడుదావృషాధిపతి - కొప్పెడునాయకుఁడై చెలంగు నిం
దెక్కుడువాడెవండో ।

తా॥ ఒకడు (విష్ణువు) గోపాలకుడు అనగా గోనాయకుడు. మఱియొకడు (శివుడు) వృషభాధిపతికి నాయకుడు. అనగా వృషపతిపాలకుడు. వీరిద్దఱిలో నెక్కుడువాడెవడు. అనగా గోవుకన్న గోపతియగువృషభము శ్రేష్ఠమయినది. ఆ సామాన్యవృషభముకన్న దానిరాజగు వృషభము (నంది) శ్రేష్ఠము. అట్టిదానికి పాలకుడు శివుడన్నమాట.

శ్లో॥ బ్రహ్మాణమానయతి నాభిసరోజమేకో న్యోబ్రహ్మణోనఖముఖేన శిరశ్చకర్త। కో వానయోరధిక ॥ 19.

ఉ॥ ఒక్కడుబ్రహ్మఁగని - జోదరనాభిసరోజమందు నిం
ఱొక్కడుబ్రహ్మశీర్షము న-ముద్ధతిద్రుంచెనఖాగ్రధార నిం
దెక్కుడువాడెవండో ॥

తా॥ ఒకడు (విష్ణువు) బ్రహ్మదేవునినాభియందుకన్నవాడు, వేఱొకడు (శివుడు) బ్రహ్మశిరస్సును తనగోటితోగిల్లివైచినవాడు. వీరిద్దఱిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ విశ్వైకదేశవసతిర్నన్వదమేకస్త్వమేకో విశ్వాధికోయమితియాతిహి
కీర్తిమస్య॥ కోవానయోరధిక ॥ 20.

ఉ॥ ఒక్కఁడు విశ్వమందమర - నొక్కదివసించె మనొక్కచోట నిం
కొక్కఁడు కీర్తిఁ జెందె జగ - దధికుఁడన్న ప్రసిద్ధసూక్తి నిం
దెక్కుడువాఁడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) విశ్వమందు నొకచోట నివాసముగానున్నవాఁడు వేఱొకడు (శివుడు) విశ్వాధికుడనుపేరుగలవాడు. వీరిద్దఱిలో నెక్కువవాఁడెవడు.

శ్లో॥ ఏకోస్తి కేశవ ఇతిప్రథితస్తులోకే న్యోవ్యోమకేశ ఇతియాతిజగ
త్ప్రసిద్ధిం। కోవానయోరధిక ॥ 21.

ఉ॥ ఒక్కఁడు కేశవుండనఁగ - మున్నతిఁ గీర్తిఁ బొందెఁ జగంబునం
దొక్కఁడు వ్యోమకేశుఁడన - నొప్పెడు సర్వజగత్ప్రసిద్ధుఁడై
యెక్కుడువాఁడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) కేశవుడనుపేరుగలవాడు మఱియొకడు (శివుడు) వ్యోమకేశుడనుపేరుగలవాడు. వీరిద్దఱిలో నెక్కువవాడెవడు (దీనికి విపులముగా తాత్పర్యము. యింకొకతూర్పులో వ్రాయదలచితిని).

శ్లో॥ ఏకస్సుభక్త్యదహరన్నిజమక్షిపూర్త్యై త్వన్యోఽబ్జజంసాయన
మస్యదదాతిచక్రం। కోవానయోరధిక॥ 22.

ఉ॥ ఒక్కఁడు భక్తిఁ బూజపుటకు - నూడ్చియొసంగె నిజాక్షిసంతి నిం
కొక్కఁడు వానికిచ్చెను వ - యోరుహలోచనమున్ సుదర్శనం
బెక్కుడువాఁడెవండొ ॥.

తా॥ ఒకడు (విష్ణువు) తనభక్తికనుపరచుటకు కన్నుపెఱికి (శివుని) పూజచేసెను. మఱియొకడు (శివుడు) అభక్తికిమెచ్చి పద్మనయనమును సుదర్శనచక్రమును ఇచ్చెను. వీరిద్దఱిలో నెక్కుడువాఁడెవడు.

శ్లో॥ ఏకోవ్యగాధజలధావలతస్సమగ్నః కైలాసశైలశిఖరేఖలు
వర్తతేన్యః। కోవానయోరధిక ॥ 23.

ఉ॥ ఒక్కఁ డగాధసాగరజ - లోదరమగ్నుఁడుగాఁజలంగు నిం
కొక్కఁడు రాజతాద్రిశిఖ - రోపరిదీప్తితసంప్రవర్తమం
డెక్కుడు వాఁ డెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) అగాధమగు సముద్రజలములో వట్టడుగున మునుగుచున్నవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) కైలాసపర్వతశిఖరముల యొక్క అత్యున్నతస్థానమున నున్నవాఁడు. వీరిద్దఱిలో నెక్కువవాఁ డెవఁడు.

శ్లో॥ ఏకస్సూరైరుపగిరా హితవత్సకార తస్మిన్దదౌ సుత మపేక్షతి సాంబమన్యః। కో వానయోరధిక ॥ 24.

ఉ॥ ఒక్కఁడు పుత్రుఁ గోరి గిరి - సుగ్రతపంబొనరించెఁ దాని కిం
కొక్కఁడు మెచ్చి సాంబుఁ డను - నొక్కకుమారకు నిచ్చె వీరిలో
నెక్కుడు వాఁ డెవండొ ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) కృష్ణావతారమున పుత్రునిఁ గోరి తపస్సు చేయఁగా రెండవవాఁడు (శివుఁడు) సాంబుఁడను కుమారుని నతని కిచ్చెను. వీరిలో నెక్కువవాఁ డెవఁడు.

శ్లో॥ ఏకస్తునైల్యముపయాతి శరీరమాత్రే హ్యన్యస్తునైల్యముపగచ్ఛతి కంఠమాత్రే। కో వానయోరధిక ॥ 25.

ఉ॥ ఒక్కఁడు నీలదేహమున - నొప్పుచునుండు స్వభావమాత్రమం
దొక్కఁడు కంఠమాత్రమున - నొందెను నైల్య మొకప్డు డిచ్ఛమై
నెక్కుడు వాఁ డెవండొ ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) స్వభావసిద్ధముగా శరీరమంతయు నల్లనిరంగుగలవాఁడు. వేఱొకఁడు (శివుఁడు) స్వేచ్ఛగా కంఠప్రదేశమాత్రమున నల్లనిరంగు పొందినవాఁడు. వీరిద్దఱిలో నెక్కువవాఁ డెవఁడు.

శ్లో॥ ఏకస్య వామమహిషీ రమయాతిశీఘ్రం చాన్యో విభర్తి నితరాం పిచాప్త మూర్తిః। కో వానయోరధిక ॥ 26

ఉ॥ ఒక్కని చేఁ గ్రహింపఁబడి - రొక్కట నెన్మిదిమంది భార్య లిం
కొక్కఁడు దానఁ గానిరొ - నొప్పఁగ నెన్మిదియైనమూర్తు లిం
డెక్కుడు వాఁ డెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) ఎనిమిదిభార్యలను గైకొనినవాడు. వేఱొకడు (శివుడు) తానే యెనిమిదిమూర్తులను గైకొన్నవాడు. అనగా కృష్ణావతారమున రుక్మిణ్యాద్యష్టపట్టమహిషులను వేకొకలవాడు విష్ణువు. అణిమాద్యష్టసిద్ధులను తనరూపములుగా తన యందేకలవాడు శివుడు. వీరిద్దఱిలో నెక్కుడవాడెవడు.

శ్లో॥ ఏకోలుఠత్యనుదినం యమునాజలేషు త్వన్యోదధాతి శిరసా మహతీం చ గంగాం। కో వానయోరధిక ॥ 27.

ఉ॥ ఒక్కడుసర్వదా మునుఁగు - చుండును దా యమునాజలంబులం
దొక్కడు తాధరించెఁదల - నొక్కటఁగాంగమహాఝరాంబువిం
దెక్కుడు వాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) యమునాజలములో మునుఁగుచుండువాడు. వేఱొకడు (శివుడు) గంగయనుగొప్పనది నంతయు శిరస్సునధరించినవాడు. వీరిద్దఱిలో నెక్కుడవాడెవడు.

శ్లో॥ ఏకస్సువర్ణవసనం సదధాతి కట్యా మన్యస్సువర్ణగిరిచాప మధాత్కరాగ్రే। కో వానయోరధిక ॥ 28.

ఉ॥ ఒక్కడు కాంచనాంబరము - నొప్పఁగఁదాఁగటియందుఁగట్టు వే
ఱొక్కడు కాంచనాద్రిధను - వ్రెక్కకరాగ్రమునందుఁబట్టు నిం
దెక్కుడు వాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) బంగారువస్త్రమును మొలయందుగట్టుకొన్నవాడు. మఱియొకడు (శివుడు) బంగారుపర్వతమును చేతియందుఁబట్టుకొన్నవాడు. వీరిద్దఱిలో నెక్కుడవాడెవడు.

శ్లో॥ ఏకోదధాతి శిరసి బార్హిణపింఛ మాత్రమన్యో మయూరవరవాహనపుత్రమావ। కో వానయోరధిక ॥ 29

ఉ॥ ఒక్కడు బర్హిణపింఛముల - నుత్సుకతం దలఁదాల్చుచుండు వే
ఱొక్కడు బర్హిరాజలస - దుత్తమవాహనపుత్రుఁగాంచె నిం
దెక్కుడు వాడెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) నెమలియీకలను శిఖయందుఁజుట్టుకొనువాడు. వేఱొక

దు (శివుడు) శ్రేష్ఠమైన నెమలియే వాహనము గాఁగల పుత్రునిఁగన్నవాఁడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోదధాతిహృది కౌస్తుభరత్నమేక మన్యస్వహస్త ఫణరత్నమహీంద్రహారం। కో వానయోరధిక ॥ 30.

ఉ॥ ఒక్కఁడు కౌస్తుభంబ నెడి- యొక్కమణిన్ హృదిఁ దాల్చుచుండు వే
ఱొక్కఁడు దాల్చు వేయిమణు - లున్న ఫణీంద్రవు కంఠహార మిం
దెక్కుఁడువాఁ డెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) కౌస్తుభమను పేరిగల రత్నము నొక్కదాని నే హృదయమున ధరించువాఁడు; వేఱొకడు (శివుడు) వేయిమణులున్న వేయిపడగలుగల నాగేంద్రుని కంఠహారముగాఁగలవాఁడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఇంద్రానుజో హి స ఉపేంద్ర ఇతీడ్య ఏక ఇంద్రాదిభిస్సురగణైః పరిపూజ్య ఏకః। కో వానయోరధిక ॥ 31.

ఉ॥ ఒక్కఁడుపేంద్రరూపమున - నొప్పెడు నింద్రుని తమ్ముఁడౌచు, వే
ఱొక్కఁడు పూజ్యుఁడై యెసఁగు - చుండెడు నింద్రుని చేసురాళిచే,
నెక్కుఁడువాఁ డెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) ఉపేంద్రుడను పేరుతో నింద్రునికి తమ్ముడు. వేఱొకడు (శివుడు) ఇంద్రుని చేతను దేవతలచేతను లెస్సగాఁ బూజింపఁబడువాఁడు. వీరిద్దఱిలో నెక్కుడువాఁడెవఁడు.

శ్లో॥ లక్ష్మీ ఇవ వహన్నపి చ వాంఛతి వి త్తమేకో భిక్షాటనన్నపి చ యచ్ఛతి భాగ్యమన్యః। కో వానయోరధిక॥ 32.

ఉ॥ ఒక్కఁడు వక్షమందు సిరి - యున్నను గోరుచునుండు విత్తమిం
కొక్కఁడు బిచ్చమెత్తుకొను - చున్నను సంపద లెల్లనిచ్చు నిం
దెక్కుఁడువాఁ డెవండొ ॥

తా॥ ఒకడు (విష్ణువు) వక్షమందు లక్ష్మినికలిగియు నితరుల ద్రవ్యముకొఱకు వేఁడుచుండును. వేఱొకడు (శివుడు) బిచ్చమెత్తుకొనుచున్నను ఇతరులకు సర్వసంపదల నిచ్చువాడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకః కరేణ ధృతవానిహ పాంచజన్యమన్యస్తథైవ బహువిశ్వసృజః కపాలం। కోవానయోరధిక॥ 33.

ఉ॥ ఒక్కఁడు చేధరించుగద - యొప్పిదమౌనసి పాంచజన్య మిం
కొక్కఁడు చేధరించు జగ - దుద్భవకారకు నుత్తమాంగ, మిం
దెక్కుఁడు వాఁడెవండొ ।

తా॥ ఒకడు (కృష్ణుడు) పాంచజన్యమను శంఖమును చేతధరించినవాడు (పాంచజన్యమనగా "మాలతానిసంబంధము" అని శ్లేషకూడా కలదు.) వేఱొకడు (శివుడు) అనేక జగత్తులను సృష్టిచేసిన బ్రహ్మకపాలమును చేతధరించినవాడు. వీరిద్దరిలో నెక్కుడవాడెవడు.

శ్లో॥ ఏకస్తు మాధవ ఇతి ప్రథితస్స్వనామ్నా చాన్యోప్యుమాధవ ఇతి ప్రథితస్స్వనామ్నా। కోవానయోరధిక ॥ 34.

ఉ॥ ఒక్కఁడు మాధవుండనఁగ - నొప్పుఁ ద్రివర్ణయుతాఖ్యచేత వే
ఱొక్కఁడు మాధవుండనఁగ - నొప్పెడు వర్ణచతుష్టయాఖ్యచే
నెక్కుఁడు వాఁడెవండొ ।

తా॥ ఒకడు (విష్ణువు) "మాధవ" అను పేరుగలవాడు. వేఱొకడు (శివుడు) "ఉమాధవ" అను పేరుగలవాడు. వీరిద్దరిలో నెక్కుడువాడెవడు. (దీనికి విపులముగా తాత్పర్యము యింకొకశాస్త్రములో వ్రాయబడును. సామాన్యతారతమ్యము మాత్రము చాలును).

శ్లో॥ బృందావనే చరతి గోభిరుపేత్య చైకో హ్యన్యో భృశం పితృవనే చ రతీహ భూతైః। కోవానయోరధిక॥ 35.

ఉ॥ ఒక్కఁడు ధేనువుల్ గొలుచు-చుండఁ జరించును బృందభూములం
దొక్కఁడు భూతముల్ గొలుచు-చుండఁ జరించు శ్మశానభూములం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) గోవులతోకూడా మనోహరమగు బృందావనమందు సంచరించువాడు. మఱియొకడు (శివుడు) భూతములతోకూడా భయంకరమగు శ్మశానభూములయందు సంచరించువాడు. వీరిద్దరిలో నెక్కుడువాడెవడు.

ఉ॥ ఒక్కఁడులోకమంతయును వెల-యున్విహగేంద్ర తురంగముండు నా
నొక్కఁడులోకమంతయు వెల-యు న్వృషభేంద్రతురంగముండు నా
నెక్కుడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) పక్షివాహనముగాఁగలవాఁడు. వేఱొకఁడు (శివుఁడు) ఎద్దు వాహనముగాఁగలవాఁడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్తుయోనిజ ఇతి వ్యాగమత్ప్రసిద్ధి మన్యస్త్వజాత ఇతి యాతి జగ
త్ప్రసిద్ధిం। కో వానయోరధిక॥ 40.

ఉ॥ ఒక్కఁడు సుప్రసిద్ధముగ- యోనిజుఁడై ప్రభవించుచుండు నిం
కొక్కఁడు సుప్రసిద్ధముగ- నొప్పనజాతుఁడనంగ ఘనత్వమం
దెక్కుడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) అవతారాది భేదములచేత ననేకయోనులయందు పుట్టుచుండువాఁడని జగత్ప్రసిద్ధిగలవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) పుట్టువులేనివాఁడని జగత్ప్రసిద్ధిగలవాఁడు వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్త్వనిత్య ఇతి సుప్రథితో జగత్యా మన్యస్తు నిత్య ఇతి సంశ్రుత
లోకసిద్ధిః। కో వానయోరధిక॥ 41.

ఉ॥ ఒక్కఁడు సర్వలోకముల- నొప్పననిత్యుఁడనన్ జనోక్తిచే
నొక్కఁడు సర్వలోకముల- నొప్పును నిత్యుఁడనన్ జనోక్తిచే
నెక్కుడు వాఁడెవండొ॥

ఒకఁడు (విష్ణువు) అనిత్యుఁడనుపేరుతో లోకప్రసిద్ధిఁజెందినవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) నిత్యుఁడనుపేరుతో ప్రసిద్ధుఁడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోహ్యులూఖల నిబద్ధ ఇతి ప్రసిద్ధ స్త్వన్యో విముక్తభవపాశ ఇ
తి ప్రసిద్ధః। కో వానయోరధిక॥ 42.

ఉ॥ ఒక్కఁడు పాశబద్ధుఁడై- యొప్పను లూఖలమధ్యమందు నిం
కొక్కఁడు ముక్తపాశభవుఁ- డొప్పఁగ సర్వజగత్ప్రసిద్ధిచే
నెక్కుడు వాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) ప్రకృతిపాశములు అనగా సాధారణపుత్రాళ్లచేత రోటి నడుమున కట్టిపెట్టబడినవాడు. మరియొకడు (శివుడు) ముక్తభవపాశుడు (వదిలిపెట్టిన సంసారపాశబంధములు కలవాడు.) అనగా సంసారబంధము లేనివాడనుట. ఈయిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకస్తుపార్థరథవాజికృతోపచారస్త్వన్యస్తుపార్థసమరప్రణుతప్ర
భావః। కో వానయోరధికః। 43.

ఉ॥ ఒక్కడు పార్థుసారధిగ నొప్పెడి సప్త్యుపచారకర్త యిం
కొక్కడు పార్థయుద్ధసమయోన్నతిసంస్తుతసంప్రభావు డిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) అర్జునుని రథసారథియై గుఱ్ఱముల ఉపచారములు చేయువాడు. మఱియొకడు (శివుడు) అర్జునుడుచేయు సమస్తయుద్ధములయందును ముఖ్యముగా కిరాతార్జునీయయుద్ధమున నర్జునుచే స్తుతిచేయబడిన ప్రభావముగలవాడు. ఈయిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ వ్యాప్తత్వాద్విష్ణురయమిత్యనుభావ్య ఏకో న్యోవిష్ణువల్లభ ఇతి ప్రథిత
స్త్రిలోక్యాం। కో వానయోరధికః॥ 44.

ఉ॥ ఒక్కడు వ్యాప్తకత్వమున నొప్పెడు విష్ణువనంగ జగంబు నం
దొక్కడు ముజ్జగంబుల జనోక్తవిధంబుగ విష్ణువల్లభుం
డెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) లోకమంతటను వ్యాపించియుండుటచేత విష్ణువను పేరుగలవాడు. మఱియొకడు (శివుడు) ముల్లోకములయందును విష్ణువల్లభుడు అనే పేరుపొందినవాడు. ఈయిద్దఱిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకో జనార్దన ఇతి ప్రకటీకృతోయ మన్యస్తు శంకర ఇతి ప్రకటీ
కృతేస్మ। కో వానయోరధికః॥ 45.

ఉ॥ ఒక్కడు ఖ్యాతిఁ జెందును గదా యొప్పఁగ దానుజనార్దనుండు నా
నొక్కడు శంకరుండని బహుప్రకటీకృతుడై చెలంగు నిం
దెక్కుడువాడెవండొ॥

శ్లో॥ ఏకోవిశాంతమభవద్వటపత్రశాయీ చాన్యోభవద్వటమహాత్తరుమూలవాసీ। కోవానయోరధిక॥ 49.

ఉ॥ ఒక్కడుతానుపండుకొని- యుండుగదావటపత్రశయ్యయం
దొక్కడుతానివాసముగ- నుండుగదావటవృక్షమూలమం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) సర్వదా వటపత్రమందు శయనించియుండు (సూక్ష్మదేహముగల) వాడు. మరియొకడు (శివుడు) సదా వటవృక్షముయొక్క మొదట అనగా మూలమున నివాసముగానుండు (స్థూలదేహముకల)వాడు. ఈ యిద్దరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకోదధాసితమృదంతిలకంలలాటే హ్యన్యోదధావుతవహంతిలకంలలాటే। కోవానయోరధిక॥ 50.

ఉ॥ ఒక్కడు శ్వేతమృత్తిలక- ముంచెలలాటతలంబునందు నిం
కొక్కడుహవ్యభుక్తిలక- ముంచెలలాటతలంబునందు నిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) తెల్లమట్టిని నొసటబొట్టుగా పెట్టుకొన్నవాడు. మరియొకడు (శివుడు) మండుచున్నట్టి యగ్నిని బట్టి నొసటబొట్టుగా పెట్టుకొన్నవాడు ఈయిద్దరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకోదధాతితులసీకృతమాలికాంహి త్వన్యోదధాతిచ విధాతృకపాలమాలాం। కోవానయోరధిక॥ 51.

ఉ॥ ఒక్కనివక్షమందువెల- యుందులసీకృతపుష్పమాల యిం
కొక్కనివక్షమందువెల- యుంగదబ్రహ్మకపాలమాల యిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) తులసీదళములతో నొప్పుచున్న పుష్పమాలను ధరించినవాడు. మరియొకడు (శివుడు) బ్రహ్మకపాలములే మాలగాధరించినవాడు. వీరిద్దరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకోహిరణ్యవసనోనుసృతోహిగోపై దిక్పాలకైరనుసృతస్తుది
గంబరోన్యః। కోవానయోరధికః॥ 52.

ఉ॥ ఒక్కఁడుగోపకానుసృతిఁ- నొప్పెడుఁగాంచనచేలుఁడయ్యు నిం
కొక్కఁడుదిక్ప్రపానుసృతిఁ- నొప్పెదిగంబరుఁడయ్యు వీరియం
దెక్కుఁడువాఁడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) కాంచనచేలుఁడయ్యును గోపాలకులచేత ననుసరింపఁబడువాఁడు. మఱియొకడు (శివుఁడు) దిగంబరుఁడయ్యును దిక్పాలకులచేత ననుసరింపఁబడువాఁడు. వీరిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోగిళత్యనుదినంనవనీతమేవ చాన్యోగిళత్యతిభయంకర కాలకూ
టం। కోవానయోరధికః॥ 53

ఉ॥ ఒక్కఁడు వెన్నముద్దలమ- హోత్సుకుఁడై దిగమ్రింగుచుండు నిం
కొక్కఁడు మ్రింగు భీకరమ- హోగ్రవిషాయితకాలకూట మిం
దెక్కుఁడువాఁడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) దినదినము వెన్నముద్దలను మ్రింగువాఁడు. మఱియొకడు (శివుఁడు) అతిభయంకరమగు కాలకూటవిషమును మ్రింగువాఁడు. ఈయిద్దఱిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోమృగాభిలషితోగహనేచచార హ్యన్యోమృగం కరతలేనవ
హన్నిహాస్తే। కోవానయోరధికః॥ 54.

ఉ॥ ఒక్కరుఁడాసతోఁదిరిగె- నొక్కమృగంబునకై వనంబునం
దొక్కఁడుతామృగంబుఁగొని- యుంచుకొనెంగదయొక్కచేత నిం
దెక్కుఁడువాఁడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) మృగముకొఱకు వనమెల్లయుఁదిరిగినవాఁడు. (తుదకుఁబట్టుకొనలేకపోయినవాఁడు.) మఱియొకడు (శివుఁడు) తానుమృగమునుపట్టి సర్వదాయొకచేతిలోఁ బెట్టుకొన్నవాఁడు. ఈయిద్దఱిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోదశాస్యహృతనైజవధూకఆసీ దన్యోవధూవిలసితార్ధశరీర
ఆసీత్। కోవానయోరధికః॥ 55.

ఉ॥ ఒక్కఁడు రావణాపహృత- యోషితుఁడై వెలుఁగొందువాఁడు వే
ఱొక్కఁడు సార్థవామవపు- రుజ్జ్వలయోషుఁడుగా వెలుంగు నిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) రావణునిచేత హరింపబడిన భార్యగలవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) తన వామదేహమందు వెలుఁగొందుచున్న భార్యకలవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్తు శైలనిచయైశ్శరధింబబంధ హ్యన్యస్తమేవశరధింశరధించ కార। కో వానయోరధిక॥ 56.

ఉ॥ ఒక్కఁడు శైలజాలముల- నుద్ధతి కాండధిఁ గట్టుఁగట్టె నిం
కొక్కఁడు కాండధిం దనకు- నొప్పగు కాండధిగా నొనర్చె నిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) పర్వతములచే సముద్రమున గట్టుకట్టినవాఁడు, మఱియొకఁడు (శివుఁడు) ఆసముద్రమునే తనకు అమ్ములపాదిగా చేసుకొన్నవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు

శ్లో॥ ఏకస్తుమర్కటభటేనదదాహలంకా మన్యశ్శరేణచదదాహపురత్రయంతత్। కో వానయోరధిక॥ 57.

ఉ॥ ఒక్కఁడు గాల్చె లంకయను- నొక్కపురంబును గీశభృత్యుచే
నొక్కఁడు గాల్చె బాణమున- నొక్కట మూఁడుపురంబు లిందులో
నెక్కుఁడు వాఁడెవఁడో।

తా॥ ఒకఁడు (విష్ణువు) తనబంటగు నాంజనేయునిచేత లంకాపట్న మొక్కటినే కాల్పించెను. మరియొకఁడు (శివుఁడు) తనబాణముచేత మూఁడుపురములను భస్మముచేసెను. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్తుమర్కటబలైర్నిజకార్యకారీ హ్యన్యస్సురేంద్రనివహైర్నిజకార్యకారీ। కో వానయోరధిక॥ 58.

ఉ॥ ఒక్కఁడునైజకార్యమువ- నౌకసులన్ సమకూర్చి చేసె విం
కొక్కఁడునైజకార్యముని- వౌకసులన్ సమకూర్చి చేసె విం
దెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) వానరబలముచేత దనకార్యమును సాధించినవాఁడు. వే ఱొకఁడు (శివుఁడు) దేవేంద్రాది దేవతల బలముచేత దనకార్యమును సాధించినవాఁడు. వీరిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోవివేశ సరయూసలిలాంతరాళే హ్యన్యోదధౌ త్రిపథగాంకణ
జజూటాయాం। కో వానయోరధికః॥ 59.

ఉ॥ ఒక్కఁడు తామునింగెసర- యూజలమధ్యమునందు నింకొకం
డొక్కకణంబుమాడ్కి జడ- నుంచుకొనెం ద్రిజగత్స్రవంతి నిం
దెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) సరయూజలమధ్యమునఁ దామునిఁగెను. మఱియొకఁడు (శివుఁడు) మూఁడులోకములయందును బ్రవహించుచున్న గంగను ఒకకణమువలె జడ యందుంచుకొనెను. వీరిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకశ్శివం జగతిపూజయతిస్మ సేతౌ రామేశ్వరోద్యసుజనైః పరిదృ
శ్యతేహి। కో వానయోరధికః॥ 60.

ఉ॥ ఒక్కఁడు శంభుపూజనము- హాదధి సేతువునొద్దఁ జేసె విం
కొక్కఁడు రామలింగశివు- డొప్పుగ నేఁటికి దృశ్యుఁడచ్చ టిం
దెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) సేతుబంధవసమయమున శివప్రతిష్ఠచేసి పూజించెను. రా మేశ్వరమున రామలింగస్వామియను పేరశివుఁడు నేటికిని సజ్జనులచే నచట దర్శింపఁబడు చుండును. వీరిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్తుమత్స్యతనుమేత్యగతోబ్ధితోయే హ్యన్యస్తు మత్స్యకలితధ్వ
జధకృత్సిద్ధః। కో వానయోరధికః॥ 61.

ఉ॥ ఒక్కఁడు మత్స్యదేహమున- నుండునముద్రజలంబులందు విం
కొక్కఁడు మత్స్యకేతనుని- యుబ్బడఁ జెన్ దహియించిమించి యిం
దెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) మత్స్యరూపమున సముద్రములో నీదుచున్నవాడు. మరియొకడు (శివుడు) మత్స్యధ్వజుడగు మన్మథుని దహించినవాని గ్రంథములయందు ప్రసిద్ధుడు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకో నృసింహతనుమేత్య జఘాన దైత్య మన్య స్తమేవ హతవాన్ శర
భావతారే। కో వానయోరధికః॥ 62.

ఉ॥ ఒక్కఁడు నారసింహతను- వుగ్రతఁ దాల్చి దైత్యుఁ ద్రుంచె నిం
కొక్కఁడు దన్నువానిశిర- ముగ్రతఁ దా శరభావతారుఁడై
యెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) నరసింహావతారుఁడై హిరణ్యకశిపుని సంహరించెను. వేఱొకఁడు (శివుడు) శరభావతారుఁడై వాని (నరసింహుని) శిరంబుఁ దన్నెను. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకో వటుః కపట ఇత్యభణై రభాణి విద్యాగురు స్త్వపర ఇత్యభణై
రభాణి। కో వానయోరధికః॥ 63.

ఉ॥ ఒక్కఁడు బ్రహ్మచారియై- యొప్పెడు కైతవవేషవృత్తి నిం
కొక్కఁడు బ్రహ్మవిద్యలకు- నొప్పెడుఁ దా గురువై జగంబునం
దెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) కపట బ్రహ్మచారిరూపమును ధరించినవాడు. (బ్రహ్మచారి యనగా బ్రహ్మవిద్యాభ్యాసము చేయువాడు) అట్టి బ్రహ్మవిద్యలకెల్ల గురువైన వాడు వేఱొకడు (శివుడు) అనగా బ్రహ్మచారికి గురువు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకో జఘాన వనితామిహ తాటకాఖ్యా మన్యో జఘాన హిమదాంధ
కరాజసేంద్రం। కో వానయోరధికః॥ 64.

ఉ॥ ఒక్కఁడు తాటకాఖ్యయగు- నొక్కనిశాచరకాంతఁ ద్రుంచె నిం
కొక్కఁడు దానవుఁ ద్రుంచెను మ- దోత్కటరాజసు నంధకాఖ్యు నిం
దెక్కుఁడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) తాటకయను పేరుగల రాక్షసస్త్రీని సంహరించెను. వేఱొకడు (శివుడు) లోకకంటకుడగు మదించిన యంధకాసురుడను పేరుగల రాక్షసుని సంహరించెను. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకస్య రావణవధే ధృఢశక్తిరస్తి హ్యన్యస్య సర్వఖిలమోషు ధృఢా౽స్తి శక్తిః। కో వానయోరధికః॥ 65.

ఉ॥ ఒక్కనిశక్తి రావణవ-ధోచితమై దృఢమై వెలుంగు నిం
కొక్కనిశక్తి సర్వఖిల- మోచితమై దృఢమై వెలుంగు నిం
దెక్కుడు వాడెవండొ॥

తా॥ ఒకనికి (విష్ణువునకు) రావణుని వధించుటయందు దృఢమైనశక్తికలదు. మరియొకనికి (శివునకు) సమస్తలోకములను నాశనముచేయు దృఢమైన శక్తికలదు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకః ప్రసిద్ధ ఇతి సంప్రతి వాసుదేవః దేవ్యా మహానితి పరస్తు తిషు ప్రసిద్ధః। కోవానయోరధికః॥ 66.

ఉ॥ ఒక్కడు దేవుడై యెసఁగు- చుండును "వాసు" పదప్రపూర్వు
డై । యొక్కడు దేవుడై యెసఁగు- చుండు "మహా" పదపూర్వ
యుక్తి నిం దెక్కుడు వాడెవండొ।

తా॥ ఒకఁడు (విష్ణువు) వాసుదేవుడ (వసుదేవుని కుమారుడ) ని ప్రసిద్ధిగలవాడు. మఱియొకడు (శివుడు) మహాదేవుడు (గొప్పదేవుడు) అని ప్రసిద్ధిగలవాడు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకః శిశుః శకటం సహసానునోద హ్యన్యః పదాంగుళినకైలగిరిం నునోద। కో వానయోరధికః॥ 67.

ఉ॥ ఒక్కడు సాహసత్వమున- నొక్కటఁ దాశకటంబుఁ దన్ని నిం
కొక్కడదం దెఁగాఁగదల- కుండఁగఁగొండను కాలిగోర నిం
దెక్కుడు వాడెవండొ।

తా॥ ఒకడు (విష్ణువు) ఒకానొకసమయమున నొకశకటమును కాలితో దన్నెను. వేరొకడు (శివుడు) తనకాలి బొటనవ్రేలి గోరుతో పర్వతమును కదలకుండా అణగద్రొక్కెను. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకః పదత్రయమితం త్రిజగచ్చకార చాన్యః పదాహతిహతం త్రిజగచ్చకార। కోవానయోరధికః॥ 68.

ఉ॥ ఒక్కఁ డిమూఁడుపాదముల- కొప్పిమితంబగుమజ్జగంబు లిం
కొక్కఁ డెయొక్కపాదహతి- నోలిహతంబగుమజ్జగంబు లిం
దెక్కుఁడువాఁ డెవఁడొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) మూఁడులోకములను మూఁడుపాదములు (అడుగులు) గా మితికిలోపరచినవాడు వేఱొకఁడు (శివుఁడు) మూఁడులోకములను తనయొక్క కాలితన్నుచేత నాశనమగునట్లుగా హతికిలోపరచినవాడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్యరూపమధిగచ్ఛతి తామసత్వ మన్యస్యరూపమధిగచ్ఛతి సా
త్వికత్వం। కో వానయోరధిక॥ 69.

ఉ॥ ఒక్కఁ డిరూపమిజ్జగతి- నొప్పెడుఁ దామసభావమందు నిం
కొక్కఁ డిరూపమిజ్జగతి- నొప్పెడు సాత్త్వికభావమందు నిం
దెక్కుఁడువాఁ డెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) కేవలము తమోగుణమువంటి నల్లని స్వరూపముగలవాడు. వేఱొకఁడు (శివుఁడు) కేవలము సాత్త్వికగుణమువంటి తెల్లనిరూపముగలవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ నీలోపినీలయమునాజలమగ్న ఏకః శ్శుభ్రోపిశుభ్రతరదివ్య ధునీధ
రోన్యః। కో వానయోరధిక॥ 70.

ఉ॥ ఒక్కఁడు నీలుఁడై మునుఁగు- చుండు సదా యమునాజలంబులం
దొక్కఁడు శుభ్రుఁడై యగుచు- నుండును శుభ్రతరాపగాధరుం
డెక్కుఁడువాఁ డెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) నీలదేహుఁడయ్యును యమునానీలజలంబుల మునుఁగుచుండును. వేఱొకఁడు (శివుఁడు) స్వచ్ఛమైన తెలుపురంగుగలవాఁడయ్యును మిక్కిలితెల్లనైన యాకాశగంగను ధరించినవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోపరాహతనుమేత్య భువం విలేఖ హ్యన్యో భువం చ సహసా స్వర
థం చకార। కో వానయోరధిక॥ 71.

ఉ॥ ఒక్కఁడు క్రోడరూపుఁడయి- యుర్వినిఁ గేఁచరించుచుండు నిం
కొక్కఁడు సాహసత్వమున- నుర్వినఁ జేసుకొనెన్ రథంబు నిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) వరాహావతారుఁడై తనదంష్ట్రలతో భూమినెగిరుచుండును. మఱియొకఁడు (శివుఁడు) సాహసముచేత భూమినే తనకు రథముగాఁ జేసుకొన్నవాఁడు. వీరిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకశ్చలాం నిజవధూం న శశాక సోఢు మన్యశ్చ దార వనితాం
స్ఫుట మర్ధగాత్రే । కోవానయోరధిక॥ 72.

ఉ॥ ఒక్కఁడు నిల్వరించుటకు- నోఁపఁడు చంచలయైన భార్య నిం
కొక్కఁడు దానిముద్దుకొని- నొక్కసగంబగు మేనభార్య నిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) చంచలస్వభావముగల తనభార్యను స్థిరముగానుండునట్లు చేసుకొనలేకపోయెను. వేఱొకఁడు (శివుఁడు) తనభార్యను సగము శరీరమునందే యుంచుకొనెను. వీరిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకో విభాతి వితరాం శిఖిపిఞ్ఛచూడ స్త్వన్యో విభాతి నితరాం నవ
చంద్రచూడః । కోవానయోరధిక॥ 73.

ఉ॥ ఒక్కని చూడదేశమున - నొప్పుచునుండును మయూరపింఛ మిం
కొక్కని చూడదేశమున- నొప్పిదమూనవచంద్రబింబ మిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) శిరస్సునందు నెమలియీకఁగలవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) శిరస్సునందు నూతనమైన చంద్రబింబముఁగలవాఁడు. వీరిలో నెక్కుడవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్య సూకరజనిస్సుఖాత్రహీనా హ్యన్యస్య చేచ్ఛరభరూపమ
తిప్రసిద్ధం । కోవానయోరధిక॥ 74.

ఉ॥ ఒక్కఁడు లోకనింద్యమగు- నొక్కవరాహవపుమేను దాల్చె నిం
కొక్కఁడు లోకమాన్యముగ- నొందెను శారభస్వరూప మిం
దెక్కుఁడు వాఁడెవండొ।

తా॥ ఒకడు (విష్ణువు) అసహ్యాకరమును నింద్యమునగు పందిరూపముగైకొన్నవాడు. మఱియొకడు (శివుడు) ప్రశస్తమగు శరభరూపమును గైకొన్నవాడు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకో విభాతి భృశమేకముఖాంబుజేన హ్యన్యో విభాతి భువి పంచ
ముఖైః ప్రశస్తైః । కో వానయోరధికః॥ 75

ఉ॥ ఒక్కడు పద్మతుల్యమగు- నొక్కముఖంబునఁ దేజరిల్లు నిం
కొక్కడు దేజరిల్లెడు స- ముజ్జ్వల పంచముఖ ప్రశస్తిచే
నెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) పద్మమువంటి యొక్కముఖముతోనే ప్రకాశించువాడు. మఱియొకడు (శివుడు) ప్రశస్తములగు నైదుముఖములతోఁ బ్రకాశించువాడు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకశ్చతుర్భుజ ఇతి ప్రథితస్త్రిలోక్యా మన్యో భృశం దశభుజైః ప్ర
థితో జగత్యాం । కో వానయోరధికః॥ 76.

ఉ॥ ఒక్కఁడు తా ప్రసిద్ధిగను- నుర్విఁ జతుర్భుజుఁడన్న ఖ్యాతిచే
నొక్కఁడు రాజిలున్ దశభు- జోజ్జ్వలుఁడన్న ప్రతీతిచేత నిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) నాలుగుభుజములుకలవాడన్న లోకప్రఖ్యాతికలవాడు. మఱియొకడు (శివుడు) పదిభుజములుగలవాడన్న లోకప్రఖ్యాతిగలవాడు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకో గృహీత మపి వాంఛతి విత్తహీనం విత్తేశమేవ కురుతే నిజ
భక్తమన్యః । కో వానయోరధికః॥ 77.

ఉ॥ ఒక్కడు గృహీతత్వమున - నొప్పఁగ భక్తు దరిద్రుఁ జేయు నిం
కొక్కడు పాహారత్వమున - నొప్పఁగ భక్తుఁ గుబేరుఁ జేయు నిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) తనభక్తులను గర్హితమగు దరిద్రస్థితికిఁదెచ్చువాఁడు మఱియొకడు (శివుడు) తనభక్తులను అత్యుచ్చమగు కుబేరపదవికిఁదెచ్చువాఁడు. వీరిలో గొప్పవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్య పాదరజసైకశిలా బలాభూత్ స్త్రీపుంసరూపమయతే భువి
చాపరస్తు। కో వానయోరధికః॥ 78.

ఉ॥ ఒక్కఁడు నైజపాదరజ- సోద్భవితైక శిలావధూకుఁ డిం
కొక్కఁడు సర్వమానిజన- ముజ్జ్వలపుంవనితాస్వరూపుఁ డిం
దెక్కుడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) తనపాదరజస్సువలనైన (తనకుసంబంధములేని ప్రత్యేక) స్త్రీగలవాడు మఱియొకడు (శివుడు) తనయొక్క అర్ధనారీస్వరూపముతో తనయందే స్త్రీగలవాడు. వీరిలో నెక్కువవాఁడెవడు.

శ్లో॥ ఏకో ముమూర్ఛ గహనేసకిరాతబాణా దన్యోవ్యమూర్ఛయ
దుదుత్రిపురస్థదైత్యాన్। కో వానయోరధికః॥ 79.

ఉ॥ ఒక్కఁడు బాణమూర్ఛవడె- నొక్కకిరాతశరాహతిన్ వనిన్
ఒక్కఁడుముప్పురంబులన- మూహపుదైత్యుల మూర్ఛగొట్టె నిం
దెక్కుడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) అరణ్యములో కిరాతునిబాణముచేత తానే మూర్ఛపొందెను. మఱియొకడు (శివుడు) త్రిపురములలోనున్న రాక్షససమూహము నొక్కబాణముచేత మూర్ఛపొందించెను. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకః పపౌ భువనభీకరకాలకూట మన్యః పపౌ స్తనవిషం ఖలుపూతనాయాః। కో వానయోరధికః॥ 80.

ఉ॥ ఒక్కఁడు దుష్టరాక్షసవ- ధూధరలగ్న విషంబుగ్రోలె నిం
కొక్కఁడు లోకభీకరప- యోదధిజాత హాలాహలంబు నిం
దెక్కుడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (కృష్ణుడు) ఘాతుకస్త్రీ అయిన పూతన చనుమొనలను గానుకొనిన విషము పానము చేసినవాడు. మఱియొకడు (శివుడు) సమస్తలోకములకు భయముకలుగఁజేయు కాలకూటవిషమును పానము చేసినవాడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ గోవర్ధనాద్రికనకాచలచాలనాభ్యాం తద్గోకులస్య జగతామపి
రక్షణాభ్యాం । కో వానయోరధిక॥ 81.

ఉ॥ ఒక్కఁడు కొండయెత్తి వెల- యుంగదగోకులరక్షకత్వమం
దొక్కఁడు మేరువెత్తి వెల- యుంగద లోకుల రక్షకత్వమం
దెక్కుడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (కృష్ణుడు) గోవర్ధనపర్వతము నెత్తి గోవులను రక్షించెను. మఱియొకడు (శివుడు) మేరుపర్వతము నెత్తి లోకములను రక్షించెను. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్య సప్తజలధీన్పిబతిస్మ భక్తస్త్వన్యస్యైకదేశమపరస్తునిబంధ
యత్నాత్ । కో వానయోరధిక॥ 82.

ఉ॥ ఒక్కఁడతిప్రయత్నమున- నొక్కఁడఁగట్టెను సాగరంబు నిం
కొక్కని భక్తుఁడేడుదధు- లొక్కటనాచమనంబు సేసె నిం
దెక్కుడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (కృష్ణుడు) ఒక్క సముద్రమును ఒక్కచోట నతిప్రయత్నము చేసి కట్టుకట్టినవాడు మఱియొకని (శివుని) భక్తుడు (అగస్త్యుడు) ఏడుసముద్రములను పుడిసిట నిముషములోని యాచమనము చేసినవాడు. వీరిద్దరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకస్తు రామ ఇతిపావననామధర్తా రామేశ్వరోఽన్య ఇతివిశ్వగి
రోవదంతి । కో వానయోరధిక॥ 83.

ఉ॥ ఒక్కనికిన్ జగద్ధితమ- హోద్ధతిఁబావనరామనామ మిం
కొక్కనికీశ్వరోత్తరప- దోద్ధతిఁజెల్లును రామనామ మిం
దెక్కుడువాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) పవిత్రమగు రామనామముగలవాడు. మఱియొకడు (శివుడు) రామేశ్వరుడను పేరుగలవాడు. (రామ + ఈశ్వరుడు = రామేశ్వరుడు.) వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏక స్త్వఖేలదిహగోపవధూకదంబై రన్య స్తమేవబుభుజేలలనావ
తారం । కోవానయోరధికః॥ 84.

ఉ॥ ఒక్కడు గోపికానతిన - మూహముతోడ రమించిమించు నిం
కొక్కడు వానినేయనుభ- వ్యోచితకామిని గా రమించె నిం
దెక్కుడువాడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) గోపికాసమూహముతో క్రీడావినోదములనొందుచుండు వాడు. మఱియొకడు (శివుడు) స్త్రీస్వరూపముపొందిన ఆవిష్ణువునే భోగేచ్ఛతోననుభవించెను. వీరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకస్స్వనేత్ర కమలార్పణలబ్ధచక్ర స్త్వన్యస్స్వపాదజనితంప్రద
దౌచతస్మై । కోవానయోరధికః॥ 85.

ఉ॥ ఒక్కడు చక్రలోభుడయి- యొక్కనికర్పణసేసె నేత్ర మిం
కొక్కడు చక్రమున్నిజప- దోద్భవముందగవానికిచ్చె నిం
దెక్కుడువాడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) చక్రముఁగోరి తననేత్రమును (శివునికి) అర్పణచేసెను. మఱియొకడు (శివుడు) తనపాదమునందుపుట్టినచక్రమును వానికి (విష్ణునికి) ఇచ్చెను. వీరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకఃపుమానితిపరోద్వైతేతిపుత్ర స్త్వాస్తాతయోరితితు సర్వజగత్ప్ర
సిద్ధిః । కోవానయోరధికః॥ 86.

ఉ॥ ఒక్కడుపూరుషుండు మఱియొక్కడు స్త్రీయయిక్రీడ సల్పగా
నొక్కసుతుండు శాస్తయన- నుద్భవమొందెను వారికిందులో
నెక్కుడువాడెవండో॥

తా॥ ఒకడు (విష్ణువు) స్త్రీరూపముకాగా మఱియొకడు (శివుడు) పురుషరూపముతో రమించెను. వారిద్దరికిని "శాస్త" (శాస్తైరవుడు) అనుపేరుగల పుత్రుడుదయించెను. వీరిద్దరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకోదధారధరణింకమఠస్స్వపృష్ఠే చాన్య స్తమేవనిజవామకరే
దధార । కోవానయోరధికః॥ 87.

ఉ॥ ఒక్కఁడు కూర్మమై ధరణి- నోపి ధరించెను వీపునందు నిం
కొక్కఁడు వాని దాల్చెఁ దన- యొప్పిదమౌ నపసవ్యహస్తమం
దెక్కుడువాఁ డెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) కూర్మావతారుడై భూమినిఁ దనవీపుమీద వహించుచున్నవాఁడు. మఱియొకడు (శివుడు) ఆవిష్ణువునే బాణముగా తన యెడమచేతిలో నిముడ్చుకొన్నవాడు. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ మృత్యుంనిహత్య మునిపుత్రమరక్షదేకో గ్రాహంనిహత్యగజ
రాజ మరక్షదన్యః । కోవానయో రధిక॥ 88.

ఉ॥ ఒక్కఁడు మృత్యువుం దునిమి- యొక్క మునీంద్రకుమారుఁ గాచె నిం
కొక్కఁడు నక్రముం దునిమి- యొక్క గజేంద్రు నిరక్ష సేసె నిం
దెక్కుడు వాఁడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) మొసలిని జయించి గజరాజును రక్షించెను. మఱియొకడు (శివుడు) మృత్యువును జయించి మునికుమారుని (మార్కండేయుని) రక్షించెను. వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకఃపురాణ పురుషఃఖలువిశ్వనామా విశ్వేశ్వరోన్య ఇతిశా
స్త్రగిరోవదంతి । కోవానయో రధిక॥ 89.

ఉ॥ ఒక్కఁడు విశ్వనామమున- నొప్పుచునుండు పురాణపూరుషుం
డొక్కఁడు విశ్వనాథుడన- నొప్పెడు శాస్త్రవచఃప్రయుక్తి నిం
దెక్కుడువాఁ డెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) విశ్వుడను పేరుతో నొప్పుపురాణపురుషుడు. మఱియొకడు (శివుడు) విశ్వేశ్వరుడను పేరుతో శాస్త్రయుక్తముగా నొప్పుచున్నవాడు (విశ్వ ఈశ్వర=విశ్వేశ్వర) వీరిలో నెక్కువవాడెవడు.

శ్లో॥ ఏకస్స్వపాదనఖరేణుకరోతిశీఘ్రం పౌలస్త్యభంగమపరస్తురగేన
కృద్ధః । కోవానయోరధిక॥ 90.

ఉ॥ ఒక్కఁడు రావణాసురుని- యుక్కడఁగించెను గోటనొక్కుచుం
కొక్కఁడు రావణాసురుని- యుక్కడఁగించెను పోరనిక్కి యిం
దెక్కుడువాఁ డెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) రావణాసురునితో యుద్ధముచేసివాని భంగపరిచెను. మఱియొకడు (శివుడు) కొండను తనకాలిగోటితో నొక్కి రావణాసురుని భంగపరిచెను వీరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకోంతకస్సమభవద్భువి బాహుజానా మన్యస్తు తస్యగురురిత్య
గమత్ప్రసిద్ధిం । కో వానయోరధికః॥ 91.

ఉ॥ ఒక్కడు బాహుజాతులకు- నొప్పెఁగృతాంతకుఁడై జగంబునం
దొక్కడు లోకసిద్ధముగ- నొప్పెగురుండయి వానికేగదా
యొక్కడు వాడెవఁడో॥

తా॥ ఒకడు (విష్ణువు) రాజులపట్ల యమధర్మరాజై (పరశురాముఁడై) భూమియందు ప్రఖ్యాతిపొందినవాడు. మఱియొకడు (శివుడు) వానికే (పరశురామునికే) గురువను ప్రఖ్యాతిపొందినవాడు. వీరిలో నెక్కుడువాడెవడు.

శ్లో॥ ఏకః ప్రసిద్ధమిహ ధేనువధంచకార వ్యాఘ్రంనిహత్యనితరాం తతో
ర రాజ । కో వానయోరధికః॥ 92.

ఉ॥ ఒక్కడు ధేనువుం దునిమి- యొప్పిదమైన యశస్సునొందె నిం
కొక్కడు వ్యాఘ్రముం దునిమి- యుజ్జ్వలమైన యశస్సునొందె నిం
దెక్కుడు వాడెవఁడో॥

తా॥ ఒకడు (విష్ణువు) ధేనువును (గోవు= ధేనుకాసురుని) వధించి కీర్తిపొందినవాడు. మఱియొకడు (శివుడు) పెద్దపులిని (వ్యాఘ్రాసురుని) వధించి కీర్తిపొందినవాడు. వీరిలో నెక్కుడువాడెవడు. (ఆవును పులితినునుగనుక సాధువైన గోవునుచంపినవానికన్న భయంకరమగు పులినిచంపినవాడెక్కుడువాడనుట.)

శ్లో॥ ఏకస్యసూనురలికాక్షిదృగగ్నిదగ్ధో హ్యన్యస్యపుత్రఉదితః ఖలు
శాశ్వతాంగః । కో వానయోరధికః॥ 93.

ఉ॥ ఒక్కని పుత్రకుండు ఫాల- లోజ్జ్వలనేత్రదృగగ్నిదగ్ధుఁ డిం
కొక్కని పుత్రుఁ డుద్భవిలె- నుర్విపై శాశ్వతదేహుఁడౌచు నిం
దెక్కుడువాడెవఁడో॥

తా॥ ఒకని (విష్ణుని) కుమారుడు (మన్మథుడు) ఫాలాక్షునిదృష్టిచే దగ్ధుడా

రివాఁడు. (ఇక్కడ నరకశబ్దము శ్లేషగా వాడబడినది. ఒక్క నరకుఁడు. అనేకనరకములు అని యెంచుకొనవలెను.)

శ్లో॥ ఏకస్య సాధుహయవక్త్ర ఇతి ప్రసిద్ధి రన్యస్య పుత్ర ఇభవక్త్ర ఇతి ప్రసిద్ధిః। కో వానయోరధికః॥ 97.

తే॥ ఒక్కఁడు సాధుఘోటకము- ఖోజ్జ్వలుఁడన్న ప్రసిద్ధినొందు వే
ఱొక్కని పుత్రుఁడొప్పు గజ- ముఖోత్తమవక్త్రుఁడనం బ్రసిద్ధిచే
నెక్కుడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) సాధువైన అశ్వముఖముకలవాఁడని ప్రసిద్ధికలవాఁడు. (హయగ్రీవుఁడు) మఱియొకని (శివుని) పుత్రుఁడు (వినాయకుఁడు) ప్రశస్తమైన గజముఖముగలవాఁడు. వీరిద్దరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ స్తంభోద్భవో నృహరిరిత్యభిగమ్యతేక స్స్తంభో మహానలమయో హి వపుః పరస్య। కో వానయోరధికః॥ 98.

తే॥ ఒక్కఁడు నారసింహుఁడయి- యుద్భవమొందెను స్తంభమందు నిం
కొక్కని కగ్గికంబము మ- హోజ్జ్వలదేహముగాఁగ నొప్పు నిం
దెక్కుడు వాఁడెవఁడో॥

తా॥ ఒకఁడు (విష్ణువు) నారసింహరూపమున స్తంభములో నుద్భవించినవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) మహాగ్నిస్తంభమే శరీరముగాఁగలవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు. (సాధారణ స్తంభజనితునికన్న అగ్నిస్తంభశరీరుఁడెక్కువవాఁడని తెలుసుకోవలెను)

శ్లో॥ ఏకో దధౌ జలజమేకకరాంబుజేన హ్యన్యో దధౌ దహనమేకకరాంబుజేన। కో వానయోరధికః॥ 99.

తే॥ ఒక్కఁడు తాఁగరాబ్జమున- నొక్క సరోరుహమున్ ధరించె వే
ఱొక్కఁడు తాఁగరాబ్జమున- నుజ్జ్వలమౌ నసలంబుఁ దాల్చె నిం
దెక్కుడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) తనచేతియందు పద్మమును ధరించినవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) తనచేతియందు మండుచున్న యగ్నిని ధరించినవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోద్విజోపినిజమాతృశిరశ్చకర్తా హ్యన్యోవిభాతినితరాం ద్విజ
రాజమౌళిః। కోవానయోరధిక॥ 100.

ఉ॥ ఒక్కడుమాతృశీర్షమున-ముగ్రతఁద్రుంచెద్విజత్వమొంది యిం
కొక్కడు లోకమాన్యముగ- నొప్పుచుఁగా ద్విజరాజమౌళియై
యెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) తాను ద్విజుఁడై (పరశురాముఁడై) తల్లితలఁదరిగెను. మఱియొకడు (శివుడు) ద్విజరాజును (చంద్రుని) తలధరించినవాఁడు. వీరిలోనెక్కువవాఁడెవడు. (ఇక్కడద్విజశబ్దము శ్లేషగా ప్రయోగింపబడినది. ద్విజుఁడై యకార్యకరణముచేసినవాఁడొకఁడు. ద్విజునిగౌరవించువాఁడు మఱియొకఁడు అని భావము తెలుసుకోవలెను.)

శ్లో॥ శంఖాత్తనోతినితరాంధ్వనిమాత్రమేకో ఢక్కారవేణసకలానప
రస్తువర్ణాన్। కోవానయోరధిక॥ 101.

ఉ॥ ఒక్కడు శంఖరావమున- నొక్కవిధంబుగఁజేయుధ్వాన మిం
కొక్కని ఢక్కరావమున- నుద్భవిలున్ ధ్వనివర్ణసంచయం
బెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) ఒకటేవిధమగుధ్వని శంఖమువలనఁగలిగించుచుండును. మఱియొకడు (శివుడు) అన్నివిధములగు వర్ణములను ఢక్కవలన పలికించుచుండును. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకోదధారకమనీయహిరణ్యచేల మన్యోగమత్కనకవీర్య ఇతి
ప్రసిద్ధిం । కోవానయోరధిక॥ 102.

ఉ॥ ఒక్కడు కాంచనాంబరమ- నొక్కటతాను ధరించిమించు నిం
కొక్కడు సుప్రసిద్ధముగ- నొప్పును కాంచనవీర్యుఁడన్న నిం
దెక్కుడువాడెవండొ॥

తా॥ ఒకడు (విష్ణువు) పసిడిపుట్టముఁగట్టి ప్రకాశించువాఁడు. మఱియొకఁడు (శివుఁడు) బంగారమునే తనవీర్యముగా విసర్జించువాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ప్రాదుర్బభూవచతురాస్య గుదాత్పురైకో భిత్త్వాచతుర్ముఖల
లాటతలంపరోపి । కోవానయోరధికః॥ 103.

ఉ॥ ఒక్కఁడు పూర్వకాలమున- నుద్భవమొందెను బ్రహ్మగుహ్యమం
దొక్కఁడుచీల్చిబ్రహ్మముఖ- ముద్భవమొందెను దాన, వీరియం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకఁడు (విష్ణువు) పూర్వకాలమందు బ్రహ్మయొక్క గుదస్థానము (ముడ్డి) లో నుంచి పుట్టినవాఁడు. మఱియొకఁడు (శివుఁడు) పూర్వకాలమందు బ్రహ్మముఖమును చీల్చి కొని దానిలోనుండి ప్రాదుర్భవించినవాఁడు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ ఏకస్త్రిలోకమకరోత్త్రిపదప్రమాణ మన్యస్తదీయదృగగో
చరనైజపాదః । కోవానయోరధికః॥ 104.

ఉ॥ ఒక్కనికింజగత్త్రితయ- మొప్పెనుగాఁ ద్రిపద ప్రమాణమై
యొక్కనిపాదమాతనికి- నొప్పెనగోచరభావమౌచు నిం
దెక్కుఁడు వాఁడెవండొ॥

తా॥ ఒకనికి (విష్ణువునకు) మూఁడులోకములు మూఁడడుగుల ప్రమాణము కలవిగా నైనవి. మఱియొకని (శివుని) పాదములు ఆవిష్ణునేత్రముల కగోచరములు. వీరిలో నెక్కువవాఁడెవఁడు.

శ్లో॥ లింగస్వరూపమధిగచ్ఛతి భూతలేన్యః పీఠస్వరూప ముపయాతి
పరోపితస్య । కోవానయోరధిక ఇత్యనుచింత్యవృద్ధాస్సత్యం
బ్రువంతువయమేవతమాశ్రయామః॥ 105.

ఉ॥ ఒక్కఁడు పీఠరూపమయి- యొప్పఁగ దాన సుఖోపవిష్టుఁడై
యొక్కఁడు లింగరూపమున- నుర్విజనార్చితుఁడై యెసంగు నిం
దెక్కుఁడు వాఁడెవండొ మది- నెంచివచింపుడు పెద్దలార పెం
పెక్కఁగ భక్తితోడ భజి- యింతము వానినె మోక్షకాములై॥

తా॥ ఒకడు (విష్ణువు) శిలాస్వరూపముగా నుండుచుండఁగా నింకొకఁడు (శివుడు) లింగస్వరూపమున నాశిలను నధిష్ఠించి జనులచేఁ బూజింపఁబడుచుండును. వీరిలో గొప్పవాఁడెవఁడు.

ఇతి శ్రీపరమేశ్వరాధ్వర్యాపనామక సుధీమణిబిరుదాంకిత హరదత్తాచార్యవిరచిత హరిహర తారతమ్య శతశ్లోకీ సమాప్తా.

ఇది శ్రీపరమేశ్వరాధ్వర్యవను నామాంతరమును సుధీమణియనుబిరుదునుగల హరదత్తాచార్యుచే విరచితమగు హరిహరతారతమ్యశతశ్లోకి యను పద్యకావ్యము ముగిసెను.



ఇది సకలసుకవివిధేయానువర్తి పూడిపెద్ది - లింగమూర్తి ప్రణీతంబైన హరిహరతారతమ్యశతశ్లోకికి లఘుతాత్పర్యసహితాంధ్ర పద్య శతకంబునందు సర్వంబునేకాశ్వాసము.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.



